# ప్రతిభ

సంపుటి ౬ :: సంచిక ౧




సంపాదకుడు: తెలికిచర్ల వెంకటరత్నం

నవ్య సాహిత్య పరిషత్తు : గుంటూరు

# △ నవ్యసాహిత్యపరిషత్తు △

**గౌరవాధ్యక్షులు:**

శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి

శ్రీ రాయప్రోలు సుబ్బారావు

## స్థాయిసంఘము

**అధ్యక్షులు**

విశ్వనాథ సత్యనారాయణ

**ఉపాధ్యక్షులు**

గిడుగు వెంకట సీతాపతి

**కార్యదర్శి**

తెలికిచర్ల వెంకటరత్నం

**సభ్యులు**

దేవరాజు వెంకటకృష్ణారావు
గురుభాగవతుల ధర్మారావు
ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి
పిలకా గణపతిశాస్త్రి
అత్తిలి సూర్యనారాయణమూర్తి
చిరుమామిళ్ళ శివరామ కృష్ణప్రసాద్
వింజమూరి శివరామారావు
కొమర్రాజు అచ్చమాంబ
కాటూరి వెంకటేశ్వరరావు
పిసుపాటి వెంకటరమణయ్య
దేశిరాజు కృష్ణశర్మ
కోలవెన్ను రామకోటీశ్వరరావు
కొడవటిగంటి కుటుంబరావు
తుమ్మల సీతారామమూర్తిచౌదరి
పి. వి. రాజమన్నారు
శ్రీరంగం శ్రీనివాసరావు
చిలుకూరి నారాయణరావు

△

## కార్యనిర్వాహక సంఘము

**అధ్యక్షులు**

విశ్వనాథ సత్యనారాయణ

**కార్యదర్శి**

తెలికిచర్ల వెంకటరత్నం

**సభ్యులు**

కోలవెన్ను రామకోటీశ్వరరావు
నోరి నరసింహశాస్త్రి
కొమర్రాజు అచ్చమాంబ

△

## పత్రిక సంపాదక వర్గము

తెలికిచర్ల వెంకటరత్నం
శ్రీరంగం శ్రీనివాసరావు
ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి
వెన్నవ లక్ష్మీనారాయణ
అడివి బాపిరాజు
చింతా దీక్షితులు

△

## గ్రంథ నిర్ణాయక సంఘము

శివశంకరశాస్త్రి
మల్లవరపు విశ్వేశ్వరరావు
జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి
కాటూరి వెంకటేశ్వరరావు

△

# ప్రతిభ

## నవ్యసాహిత్య పరిషత్పత్రిక



సంపుటి ౨ :: సంచిక ౧

△

జూలై నెల ౧౯౪౧

△

సంపాదక వర్గము:

తెలికిచర్ల వెంకటరత్నం

శ్రీరంగం శ్రీనివాసరావు

ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి

పుస్నప లక్ష్మీనారాయణ

అడవి బాపిరాజు

చింతా దీక్షితులు

# ఉ రి కొ య్య

దేశిరాజు కృష్ణశర్మ

నేను గతించినానని అనేకులు భారము తీరినట్లు, అ
జ్ఞానుడు. దుర్మదాంధు డని చాటిరి చెప్పిననోట చెప్పకే
ఏనొక యాతనాగతిని ఈ ఉరికొయ్యను తాకి. చూచుచు
న్నానిట ఈ ప్రపంచ మిపుడైనను మారినరీతి తోచదే—

నేనొక తన్మయత్వము గణించిన మూర్తిని ఊరకూరకే
నేను చరించి పోయెను అనిశ్చల నిశ్చితమట్లు. ముగ్ధర
మ్యానన లజ్జవోలె, ఉషఃకాల తారెకు సంజమబ్బులన్
కానని కాంతినేను చవికై, మెరుపై, ఘని మాసి పోయితిన్—

నాలో కోరికలన్ని ఏకమయి గంధర్వాప్సరోభామినీ
లీలాభంగిమ లన్ని నాకొరకునా సంఘాసమై పుంజమై
ఈ లోకాన మనోహరత్వము సుఖం బింపారగా చేయు వి
ప్లలామూర్తిని నేను నా తలపులో వీక్షించె మాధుర్యమున్—

ఒక జవరాలు మెల్లన ప్రియమూర్తింలతో విభు చేరబోవు వా
లిక అడుగుల్ గసర్పులవి ఏనముగాం జను దేవిస్సిపో
లిక ఒక దివ్యభావ పరిదీనము నా కనులందు సర్వథా
ప్రకటముగా కనంబడుచు పాయదు నా ఎద యంత పుండుగాన్—

ఒక పసిపాప ఏ పసిడి యూహలలో తను పొంగిపోయి పొం
దికలు విలాసముల్ పరిగణించెనొ? నేర్పక, మొట్టిబారగా
వికటములైన గుండెలను పెంచిన దంపతులెల్ల నాకథా
వుక కరుణార్ద్రరీతులను పోల్చగ, మెచ్చగలేరు సామ్యతన్—

ఒక సంధ్యాసవవేళ నా ఎడదలో ఉల్లాస మాధుర్యవీ
చిక యొక్కందు చకచ్చకచ్చకిత సజ్జీభూర జాత్యశ్వమై
ఒక వర్షానది పొంగుగా వివిధ భావోద్రేకముల్ చేర్చ నా
సకలంబుల్ భ్రమచెందు శాశ్వతరిరంసాపేక్షతో క్రాలితిన్—

నాటి రిరంస నా ఎడద నాట్యము చేసె వసంతదీప్తియై
పాటలుపాడె పూర్ణిమ విభావరియై అవు డంతకంతకున్
పోటుగలట్టి సంద్రమయి పొంగెను పో ఇకతాళలేక నా
ఆటల పాటలన్ విసిగినట్టిది లోకము విప్రతీపమై—

ఈ సకలంబు నా మెడకు ఎత్తిన దీ ఉరికొయ్య నన్ను నా
ఆశలువీడ నీలజలదావళి క్రొత్తమెఱుంగువీడె ఆ
కాశము భర్తృహీనయటు కాంతి దొలంగెను మల్లికాంబయున్
కోసిన లేతమొగ్గల కనుంగొని రాల్చెను మౌనబాష్పముల్—

ఈ సర్వస్వము నాదుకంటికి వృథాహేయత్వరాద్ధాంతగా
థా సిద్ధాంతములందు సంటుపడి బాధన్ మూల్గు చున్నట్లుగా
నా సర్వస్వము నీవ యంచు తను పొందన్వచ్చు కాంతన్ వృథా
గా సాధించెడు క్రుద్ధభర్తగతిగా కాపణ్య నిర్ధూతమై—

మునుపొకనాడు నామనసు ముంగిట ఈసకలంబు సౌమ్యమై
అనయము వేదమూర్తియిదువై నను పెంచగ ఆహితాగ్నినై
అనువుగ ఆశిషత్త్రయము నై వివిధాశయ దివ్య దీప్తులన్
పెనిచెదనంచు కోర్కెలను పెంచితి లోకము త్రుంచె రెక్కలన్.

ఒక జన్మాంతర పాపపుణ్యఫల మీ ఒయ్యారిగా, తీవ్రభా
వుక భావాంతర దీప్తిగా ప్రబలసమ్మోహ ప్రయోగంబుగా
గికురించున్ వెరపించు నవ్వుల నధిక్షేపించు నా గుండెలో
కకుబంతావృతయాతనాతమము వాకల్ యుందుకై క్రమ్మగా—

నను వెంటాడుచు జన్మజన్మముల నానాయాతనల్ పెట్టి పో
యిన దారిన్ మఱి వచ్చుచుండెనిది నా ఇష్టార్థముల్ తీర్ప గో
రును గానీ నను అందుకో నియదు నిర్ముక్తార్థ ధర్మావలం
బనయౌచున్ నను మోహపెట్టి చెరచున్ బాధించు ఏకాగ్రితన్

ఇది నా యౌవనవేళ పర్వులిడి వచ్చెన్ శారదజ్యోత్స్నగా
పదునై రాచిన కోర్కెగా విరహతాపభ్రాంతిలో భ్రాంతిగా
ఎదలో పూచినపూవుగా ప్రణయ వాహిన్యామృతశ్రేణిగా
వదలెన్ నన్నిక నాదు జీవితగత భ్రాంతిన్ పరిశ్రాంతిగా—

నా కిపు డీ ప్రపంచ మొకనాడును నవ్వని నవ్వుగా ఎదో
చీకటికొంపగా, విరహ చిందులు లొందర యుగ్రతాపముల్
గా కనుపించు నల్లనిది కాంత యొకర్తుక ఇన్పుగజ్జెలన్
భీకర కీకరాకృతుల నృత్యమొనర్చెడి రీతి తోచెడిన్—

ఒక సుడిగాలి రివ్వుమని హోయని పిల్చును నన్ను ఇంక వే
రొకడు ఉషర్బుధుండు తన యూహలలో నను దాచివెట్టు నా
కిక ఎడమింతయేని భరియించని మిత్రులు అస్మదాదు ఏ
సుకముల నేలపై తిరుగుచుండిరి ఎగ్గుకు ఎగ్గు సేయుచున్—

ఒక పెనుభూత మీ పుడమి ఊర్జితమై గ్రసియించి నింగిపై
వికవిక ఎర్రనవ్వులను వేల్చును నాహృదయాన శాంతి కో
రికలు మనోజ్ఞతావివిధరీతులు నల్లని పెద్ద మబ్బులై
వికలములై లవంతర ద్రవీపరిపాకము విఘ్నభావమై—

మ్రోడుగనైన నా ఎడద మోసిన భారము చింతచెట్టుగా
పీడలు గ్రమ్మి కోరిక లనేకములన్ చిగురించపోదు ఆ
సాధనవాంబుదం బగుచు ఆకస మొక్కటి గ్రమ్ము దుఃఖ సం
క్రీడనమందు బాష్పపరికృష్టము లోకము బేలుపోయెడిన్—

ఎవరో గుండెలు చీల్చి నెత్తురురలఁ గ్రీడించుచున్నారు ఇం
కెవరో ముష్టిగదాభిఘాతముల వాకిళ్లన్ని మార్మ్రోగగ పె
ద్దవడిఁ బిల్చుచు ఏడ్పుచుండి రిట గ్రద్దల్ కాకు లెగ్గెత్తగా
త్రివిధార్థంబుల మూడు జన్మముల దారిద్ర్యంబు రాపాడగా—

ఒక ప్రత్యగ్ర విషాదరేఖ తరుమఁ ఉల్లాస ముల్లోలమై
క్రకచంబై గ్రసియింపగా ప్రజల వక్రక్రీడలోలాత్మలఁ
ముకుత్రాడైన వినాశసక్రమము సమ్మూలంబుగా సంస్క్రియ
ప్రకరంబుఁ జరిగింప బూనె నిపు డీ ఘోరంబు ఎట్లోర్తురో—

నాకై తర్పణ లిచ్చువారెవరు! చిన్నాదచ్చిదానందమో
సాకారాంగ నిరాకరక్రియమో? విజ్ఞానాంతపూర్ణత్వమో
లోకైకక్షుభిత సాంఖ్యసూత్రిమో? కటా! లోభప్రలోభంబులఁ
చీకాకైనది పాడులోక మిక ఛీ! ఛీ! లేచు పో! నాకిటఁ—

## శైశిర స్వప్నాలు

శిశిరాలసమ్మర్లో
శీర్ణహృదయపుటలల
కలలో
తావి సరుకులపూల
నావలే తెరలెత్తి
సాగిపోతోన్నాయి
రేపుకై;

ఎండిపోయిన తలపు
టాకులన్నీ రాలి
మ్రోడువారిన బ్రతుకు
బరువులో
చిన్ని సీతాకోక
చిలుక రెగిరొచ్చినటు
చివురులే పురుడించు
తీయగా!

అలరువై,
తలిరునై
అడవిసౌస
ఉరవడుల
మెలికలలో
మిలమిలల
కలసి పయ
నా లౌచు
తేలిపో
తోన్నట్లు
కలలు!

## రాగరేఖ!

చందమామ చల్లదనమొ
మందానిల సోయగమ్మొ
పూవులలో
తావులలో
ఛవులూరే
చివురులలో
విరబోసే పరువమ్మొ
నీ పాటల
నిండి పొరలు!

నీలగగన రాహస్యమొ
నీరధిహృదయాశయమ్మొ
గాలులలో
ఈలలలో
పక్షించల
రవళులలో
తేలివచ్చు సందేశమొ
నీ యేలల
నిధ్వనించు!

సంధ్యారుణ రాగప్రభలో
విశామసృణ కైశ్యరుచులో
కదలి నురుగు
కెరటాలై
యేటి నదల
వేగాలై
సుడులు పట్టి ప్రవాహిల్లు
నీ రాగా
లాప రేఖ!

మొక్కపాటి కృష్ణమూర్తి

## ‘Vibgyor’

### ౧

మీ చేలకు
మీ చెరువులకూ
మీ నదులకు
మీ బ్రిదుకులకూ
జలదానం చేస్తూందని
వలాహకాన్ని
పూజించి
అర్థించి
ప్రార్థించి
బ్రహ్మరథం పట్టించి
జగన్నాథరథం ఎక్కించి
చైత్రరథం పంపించారంటే-
అది -
అప్పటి కప్పుడు
అకటా వికటమై
ఉక్కిరి బిక్కిరై
అటు పరుగెత్తి
ఇటు పరుగెత్తి
ఏడ్చి

ఏలక్కాయలు తిని
నీళ్ళుగారి
పిండి పిండై
పిండి మంచై
మంచు పిండై
నశించి
కృశించి
చచ్చి
చేయంగల విన్నపాలని
మళ్లీ వచ్చి
మళ్లీ! మళ్లీ!! మళ్లీ!!!
అంటుందేమో నందోయ్.—
కొంపదీసి
తంపటేసి
జాగ్రత్త!
జాగ్రత్త!
జా.........గ్ర.........త్త
బాబూ!

### ౨

వయసొచ్చిన పైడి కన్నెలా
యెదిగిన దోరావుపెయ్యలా
ఎర యెర్రని తలిరాకులతో,
తొలిపూతల బంగరు సొమ్ముల
తో కులికే మామిడిగున్నలు
నలనల్లని నీలాకాశపు
*Back - ground* లో అందం చందం!

వత్రి యెరుపు సంధ్యాకాశపు
*Back - ground* లో వెలవెల పోవూ!
నా *Sweet - heart* నల్లని రూపుకి
తెల్లపట్టు *Saree* సొగసు!
ఆ గుండ్రని నల్లకలువ *Face*
ఆ *Face* లో తెల్లకలువ *Eyes!*
అలా అలా వస్తూ వస్తూ
కల కల కల నవ్విందంటే -

నా ముద్దుకి ముత్యాల్ హారార్
నా *Mystic beauty muse* కి
నా కవితకు చక్కిలిగింత !
నా అందం తెలిసిన కళ్లకి
*Color -effect* తెలిసిన కళ్లకి
అసలు తనే నల్లనిది గదా -
'ఆ *Nasty* నల్ల *Saree* ని

అన లెవ్వరికైనా ఇచ్చెయ్'
అంటే - మా ఆవిడ వినదే ;
ఆ మాసిన నల్ల మసిష్టం
లో తానే కనబడకుండా
తయ్యారై వచ్చి మెల్లిగా
గదిలో *Light* ను తగ్గిస్తే
ఎల్లాగుంటుందో చోలో
ఈ *Beauty worshipper* కి

బి. వి. సింగరాచార్య.



# వెన్నెల

తెలిమబ్బుల దొన్నెలలో జారి
వలిగాడుపు వడపోఁతల తేరి
నిదురించిన నీరజజీవికలో
వెన్నెలతుంపిళ్లు హసించినవి;
మృతశోణిత మిహికా నాళికలో
విరబూసిన వెన్ని గులాబీలో.
.... .... ...
దూరాన కుమారిలు ప్రేయసికీ,
ధృతిదూలి కృశించే నా యెదకూ,
వలపారు తలంపుల వంతెనలన్
వలగొన్న పురాస్మృతి గీతులతో,

జలతారు సుమాళపు తీవలతో,
అలపోక రచించును హస్త మెదో !!
.... .... ....
సుధలారని చిక్కని రోచులలో,
సొగయించే కరుపలి చలువలలో,
సరిగంగస్నానము నేను చెలి.
కాంక్షిల్ వెలిగ్రక్కిన కాదియలూ,
కన్నీ ళ్లురలించిన కళ్మలతా
ప్రక్షాళనముల్
పచరింతము చేవి ?

కొనకళ్ల వేంకటరత్నం,
సాహిత్యమండలి, ఏలూరు.

# కరుణగీతి

## వట్టికొండ రంగయ్య

తలిదండ్రుల్ మఱి చుట్టపక్కములు పంతంబాడి మూఢాత్ము ,వృ
ద్ధలలామున్. విరసున్, దయారహితు, విద్యాహీను నున్మీలదు
జ్జ్వలవల్లీ నవమోహనాంగి కకటా! ప్రాణేశుదం చెంతయో
వలదం చేర్చిన నంటగట్టిరిగదా! ప్రారబ్ధయోగంబునన్

ధనధాన్యాదులకోసమై పతికి కాంతా! అమ్మినట్లయ్యె నిన్
జనకుం డీగతి వర్తితద్విజము హింసాజీవి కర్పించులా
గనుకంపారహితుం డొకండు; భువి సౌఖ్యం బేమి నీజన్మమం
దున లేదంచు లిఖించెనేమొ విధి పంక్తుల్ మూడు నీమోమునన్

మృదుకింజల్కసుమప్రవాళపుష్పసాంద్రీభూతసౌందర్య సం
పద శోభిల్లు లతాళి కాశ్రయమునై వర్తించెనే స్థాణువుల్!
పదునారేడులు వచ్చిరాని యువతీలావణ్యరేఖోదయా
స్పదమౌ రూపము బూదిలో గలుపు నాజ్యంబట్లు వ్యర్థంబె కా!

సతతప్రోల్బణదుర్భరోగ్రమితపశ్చాత్తాపపటీవిఘూ
ర్ణితచిత్తమ్ము తపించి, మ్లానమయి తన్వీ, నేడు నానాటి కీ
గతి శుష్కించిన నిన్ను గన్గొనిన నిష్కారుణ్యచేతస్కులే
సతిదౌర్భాగ్యము సంస్మరించి అనుకంపార్ద్రాశ్రువుల్ గార్చరే!

తగుభర్తన్ వరియించి సంతతము కాంతప్రాప్తసౌఖ్యైకవి
మ్నగ నోలాడు సదృష్టరేఖ లభియింపంబోవ దీ జన్మలో;
జగదాశ్చర్యకర త్వదీయవికసత్సౌందర్య మీక్షింప నన్
స్వగతప్రశ్న గలంచు ఎందుకొర కీ సౌందర్య మం చెప్పుడున్

# చిరంజీవి పాటలు

౧

పాత పాటే
పాడుకోనా
నీ తలంపే
వీడుకోనా ॥

గొంతులోనే
కూలిపోనా
గుండెలోనే
మండిపోనా ॥,,॥

నీటిలోనీ
నీడలోనే
మేడచేసీ
ఆడుకోనా ॥,,॥

౨

కొండమీదే
వుండి నవ్వే
చిన్నిచుక్కా
చెప్పవా నా
కెవరవో నీ
వెవరవో॥

చీకటంతా
చీల్చిపాడే
చిన్నిగొంతా
చెప్పవా నా
కెవరవో నీ
వెవరవో॥

వాసనలతో
వచ్చిపిలిచే
చిన్నిపూవా
చెప్పవా నా
కెవరవో నీ
వెవరవో॥

3

నిదుర బరువులు నన్ను
వదలుచేనావో
నీవు నా మ్రోలనే
నిలుచుచేనావో॥

కొండపై సూరేడు
కొలువు తీరెనంట
కొలనులోపల తామ
రలు పూచెనంట ॥,,॥

పగలుపోయెను రేయి
వచ్చినది యన్నారు
రేయిం బవలు లేక
రీతియే నాకు ॥,,॥

కనులనిండా నాకు
కారుచీకటులేన
నీవె చీకటివోలె
నిలిచినావేమొ ॥,,॥

## ౪

- అతడు -

బంగారు సంకెళ్ళ
బందీని నేను—

- ఆమె -

బంది గొంతుకలోని
పైడిగంటను నేను

- అతడు -

పైడిసంకెల మ్రోత

- ఆమె -

పైడిగంటల మ్రోత

- అతడు-ఆమె -

తాండవేశ్వరపాద
తాళనాదమ్ములో

- అతడు -

కరగిపోయేనా

- ఆమె -

కలసి బ్రతికేనా

## ౫

నీవు లేవని యందునా
నాతోటి
రావులె మ్మనుకొందునా॥

నాచుట్టు నానీడలే
నవ్వుతూ
నమిపి వేమని యడిగితే ॥..॥

దిక్కులన్నీ జాలిగా
ఒక్కటెవె
ఎక్కడికి పోదువంటే ॥..॥

మొండిరాత్రి గుప్పిలో
నీస్వామి
వుండెనని లోక మంటే ॥..॥

## ౬

నాకు భయమేస్తోందినాన్నా
ఏదో
నల్లనల్లని నీడ
నావైపు నడిచింది
నాకు భయమేస్తోందినాన్నా॥

నాచేయి వదలకే నాన్నా
నువ్వు
నాచేయి వదలితే
నడిచివస్తదినీడ
నాచేయి వదలకే నాన్నా॥

నన్ను చూస్తూ నడువు నాన్నా
నన్ను
నీవు చూడకపోతె
నీడలు పిలుస్తాయి
నన్ను చూస్తూ నడువు నాన్నా॥

౭

నా కేమి కొదువ లున్నాయిలే
నీకు
నాకంటె ఎవ్వ రున్నారులే॥

నా మనస్సుకు తోరణాలుగా
నీతీపి
నవ్వులే కట్టుకొన్నానులే ॥..॥

నీకంఠమున పూలమాలగా
చేసి
నాకరమ్ములె వేసినానులే ॥..॥

నీపూజకోరకు హారతులుగా
నా
చూపులే వెలిగించినానులే ॥..॥

౮

స న్నెపుగరా నాకు
నేలంతకడుపు
నేలంతకడుపులో
మబ్బంత ఆకలి
మబ్బంత ఆకట్లో
మనసంత మంట
మనసంతమంటలో
మండిపోయానే
స న్నెదుగరా మీరు
స న్నెదుగరా॥

౯

నన్ను పాపనుచేసి ఊపుతున్నావా?
మిన్ను హాయెలకట్టి
మన్నునూయెలచేసి
నన్ను పాపనుచేసి ఊపుతున్నావా?

నన్ను నిద్దురపుచ్చి నవ్వుతున్నావా
నానిద్ర రేయిగా
నీ నవ్వు పగలుగా
నన్ను నిద్దురపుచ్చి నవ్వుతున్నావా?

కలలలోనే నీవు కానిపిస్తావా
నాకలలు నీదగా
నూకాంతి నీవుగా
కలలలోనే నీవు కానిపిస్తావా?

# సొంతడబ్బా

పైడిపాటి సుబ్బరామశాస్త్రి

చెత్తపెదారం
ఢమ్మఢమారం
ఉతఉలారం
ఢోరుఢోఁఐనా
హోరెత్తిస్తూ -
గలగలగలగల
గాజుపలారం.
చెవులో చిపెల్ల
ఫెతిల్లమంటూ -
కంకరరాళ్లా
ఘాటీదబ్బా.
దబదబడబదబ
లాడిస్తూ -

ఉప్పర మెగనే
దప్పులమోతా,
టుపటుపటుపటుప
మోగిస్తూ -
కీచురాళ్ళతో
పేచీపడుతూ
గింగురుగింగురు
యీలలువేస్తూ -

ఢాంఢాంఢాంఢాం
రాందోల్ మోతా,
ట్రట్టర్ ట్రట్టర్
నగారదెబ్బా.

చెవులో డ్రమ్మును
బ్రద్దలుచేస్తూ -
ఒక్క మినిట్టూ
ఊపిరిసలపక,
చెడుగుడుగుడుగుడు
గుడుగుడుగుడుగుడు
లాచేస్తున్నావ్ -
దంచేస్తున్నావ్ -
చెక్కేస్తున్నావ్ -
పొడిచేస్తున్నావ్ -

చోటుమార్చినా
ప్లేటుమార్చకా
ఒకటే పూదర
ఒకటే పూదర
పెట్టేస్తున్నావ్
కొట్టేస్తున్నావ్ -

నవ్యం సవ్యం నవ్యం అంటూ
బదబదలాడే
పదజాలంతో
లోకంకళ్లా
కప్పేస్తావ్ ?

వేడివేడిబల్
పెసరట్టంటూ
తీసినఅట్టే
తిరగేస్తావ్ ?

అయితే కానీ,
అట్లే కానీ,
పూకనే దంచూ
ఊమతూవుంటా.

మాటోయ్ - మాటా
మసలో - మాడే
ఏమన్నారో
విన్నావా—?
వినవు సుప్వా !
వినవ్ సుప్వా !!
ఇదే ! మరి
నీదగ్గర -
స్రిమోతలో
నీకే వినపడమా !
—సీదా
పైన పటారం
లోన లొటారం-ట !!

పాదరసం ఫేదై పోయీ
రూపాయ్ రూపూ మాపరిపోయీ
అర్థణారానే అసహ్యాంగా
అగపడుతోందిట ! అగపడుతోందిట !!

నెనం చెస్తా—?
ఊ - చూశావా - అంట
ఎల్లా -
ధుమా పేలిపోయి
మజా మాడిపోయి
పీయచెకి
ఎత్తురప్పి
అసాధ్యంలో
ప
డు
తోం
ది !!

(ఇది ఏ ఒక్కర్నీ ఉద్దేశించిందికాదు.)

# నోరి : ఖండకావ్యాలు

## వావిలాల సోమయాజులు

"చిన్నతనములో భారతము, భాగవతము, రామాయణమూ వ్రాసినవారు చాలా గొప్ప కవులని వారు వ్రాసినట్లుగానే చిరస్థాయిగా ఉండే కావ్యం (తాను)కూడా ఒకటి వ్రాయవలెననీ" నోరిలో ఒక అభిప్రాయం పడిపోయింది. అప్పటి కా గ్రంథాలు చదవనుకూడా లేదు. ఆచిన్ననాటి ఆశయాన్ని నెరవేర్చుకోటానికిచిన్నతనం, నుంచే పద్యరచన ప్రారంభించాడు.

అందుకు వారి నాన్నగారు చాలా సహాయం చేశారు. కుమారుడికి వ్యాకరణం నూరిపొయ్యాలని ఆయన ప్రయత్నం. ఆయన బలవంతంవల్లనే నోరి సంస్కృతము అభ్యసించ ప్రారంభించాడు. ఆయన సంస్కృతాంధ్ర పండితులు. చిన్నతనములో పాదుకాంతదీక్షవుచ్చుకున్నారట. పెద్దతనములో సంధ్యావందనముకూడా శ్రద్ధగా చేసేవారు కాదు. భోజనముముందు నోట్లో ఉదకము మాత్రము ప్రాశనచేసేవారు. మిడనరీలకు డాక్టర్లకూ ట్యూషనులుచెప్పటంవల్ల సయన్సులమీద ప్రమాణబుద్ధికలిగింది. అయినా పూర్వాచారపరాయణత ఉండక పోలేదు. పినతండ్రి గురులింగశాస్త్రిగారు గొప్ప విద్వాంసులు. సాహిత్యములో నిధి.జ్యోతిష శాస్త్రము, వేదాంతము, అవసాన దశలో వ్యాకరణమూ సంపూర్ణముగా అభ్యసించినవాడు. బయూరి త్యాగరాయ శాస్త్రులు వారు ప్రచురించిన గ్రంథాలు సమస్తమూ వారు వ్రాసినవే అనవచ్చు. తండ్రి పిన తండ్రు లిద్దరూ లౌక్యులు. ఇద్దరికీ స్త్రీ వ్యసనముకూడా లేకపోలేదని ప్రతీతి'—ఇది పితృపక్షము.

మాతృపక్షానికి వస్తే 'మాతామహుడు క్రిమూంత స్వాధ్యాయపరుడు. వారి సోదరులూ పెద్దలూ స్వాధ్యాయనము చేసిన అవధానులు. ఆయన ఆధానము చేసిన దీక్షితులు. చదువు రాదన్న మాటేగాని తల్లి గారు వినికిడివల్ల పురాణా లన్నిటి తాత్పర్యమూ గ్రహించేది. ఇంటిలో పనులన్నీ అయిన తర్వాత సత్కథాశ్రవణము, పఠనము, మననము - ఇత్యాది కాలక్షేపములతోనే పొద్దు పుచ్చేది. తెల్లవారుజామున పనిచేసుకుంటూ గజేంద్ర మోక్షముపాట-ఇత్యాదులు పాడుకుంటూ ఉండేది. రాత్రిళ్ళు పని అయిన తరువాత భజగోవిందము - ఇత్యాది స్తోత్రాలు చదువుకుంటూ నిద్రపోయేది. డాంబికములేని శిష్టతా, పదిమందితోకలసి భజనలు చేయని భక్తిశ్రద్ధలూ ఉండేవి.

పర్వదినాలలో ఉపవాసాదులూ దేవదర్శనమూ, కార్తీక మాసములో ఏకోత్తర వృద్ధిగా దీపారాధన, ఆకాశదీపము ఇత్యా

దులతో కాలము గడిపేవి. శ్రావణ శుద్ధ ఏకాదశినాడు పరలోకగతురాలైనది. 'ఏకాదశి' అనే కావ్యం ఏతత్ఫలితం.

పితృపక్షంనుంచి కొన్ని గుణాలూ, మాతృపక్షంనుంచి కొన్ని గుణాలు నోరి కబ్బాయి. ఆయన జీవితంలో కలిగిన సంఘర్షణంతా పితృపక్షలక్షణాలకూ, మాతృపక్ష లక్షణాలకూ సంబంధించింది. మాతృపక్షమే బలవత్తరమైనది. మొదట కొంతకాలము కవి హృదయంలో పితృపక్ష లక్షణాలు పనిచేసినా వయస్సు వస్తున్న కొద్దీ మాతృపక్ష లక్షణాలకు సంపూర్ణ విజయప్రాప్తి కలుగుతున్నది. కొద్ది రోజుల క్రిందట జగద్గురువులవద్ద స్వీకరించిన 'పూర్ణదీక్ష'తో ఈ విషయం రూఢి పోయింది. ఈ పక్షాల రెంటి లక్షణాలూ, వాటి సంయోగ వియోగాలూ, నిమ్నోన్నతాలూ కవి రచనలలో ప్రతిఫలిస్తూనే వచ్చినవి.

పురాణకవులనూ, వారి కవిత్వాన్నీ ఆదర్శంగా పెట్టుకొని కవిత్వము చెబుదామనుకున్న యువకవిదీక్షతో కలంచేబట్టాడు. కొన్ని ప్రబంధాలు చెప్పాడు. నవలలు, నవలా ప్రబంధ నాటకాలు, చిల్లర మొల్లరగా ఇంక ఎన్నో కృతులల్లాడు.

శ్రీ శివశంకరశాస్త్రి నోరి అన్నగారికి తోడల్లుడు. పూర్వం నోరి స్వగ్రామం గుంటూరు. ఆరోజుల్లో... శంకరశాస్త్రి గుంటూరు వచ్చినప్పుడు 'నీవు పద్యాలు వ్రాస్తావట, చూపించ'మ్మంటే సిగ్గుతో చూపక తప్పకున్నాడు నోరి. కానీ ఆయనమీద హృదయంలో ఏదో అభిమానం ఏర్పడ్డది. ఆ ప్రాంతములోనే ఒకటి రెండు రాత్రిలు ఇష్టాగోష్ఠిలో కావ్యప్రశంస వచ్చింది. దానితో నోరి హృదయాన్ని శ్రీ శివశంకరశాస్త్రి ఆకర్షించాడు. ప్రాచీన కవిత్వపు పోకడలకు స్వస్తి. నవ్యకవితాధోరణికి బీజాంకురము.

తరువాత కొన్నాళ్ళకు శ్రీశాస్త్రితో పరిచయము కాకముందూ తరువాతనూ వ్రాసిన కావ్యాలల్లో కొన్ని మాత్రము అట్టేపెట్టి మిగిలినవన్నీ ఆయన నోరిచేత దహనం చేయించాడు. నోరి కా పని అప్పుడిష్టము లేదు. కాని ఆయన ప్రోద్బలంవల్ల చేశాడు. అందులో ఒక నవల పోయింది. కొన్ని ప్రబంధాలు పోయినవి. ఒక నవలా ప్రబంధ నాటకము పోయింది. ఇక ఖండ కావ్యాలు లెక్కలేదు. అప్పుడే,

'పూవుమాత్రపుఁ బూ లెన్నో పూవుమాసి
పోయినవె కాని పిందెపూల్ పుట్టబోవు
పిందె లెన్నియొ నాశంబు నొందిగాని
పూర్ణఫల మొండు నిలువగాబోదు లతను'-
—అని కొత్తగొంతుకతో పాడాడు.

ఆ రోజుల్లో ఉన్న కవిమిత్రులు నలుగురూ తరుచుగా కలవటమూ, ఎవరన్నా కొత్త కావ్యం వ్రాస్తే అందరూ వినటమూ, తోచిన మార్పులు సూచించటమూ — అంతా ఎంతో ఖులాసాగా జరిగిపోయేది.

శ్రీ శివశంకరశాస్త్రి సూచనలు పంక్తులు మార్చడముతోనూ, మాటలుతీసి మాటలు పెట్టడముతోనూ ఆగేదికాదు. కళావిష యంలో పొంకం (Artistic Unity) లేనిది నిర్దయతో తీసివేయ మని ఆయన సలహా ఇచ్చేవాడట. దానితో వారి వారి కావ్యా లకు కూర్పులో ఒక బింకము (Finish) వచ్చేది. 'ఆయన సహాయంవల్ల స్వయంకృషి చేస్తేఎన్నాళ్లోతంటాలుపడితే నేగానిసాధ్యం కాకపోయే కళాభిరుచి అబ్బిందనీ, ఆయ నతో పరిచయము కాక ముందుండే అతి ధోరణి (Exuberance) కొంత తగ్గిందనీ. నోరి అంటుంటాడు. ఆయనతోపరిచయానికి పూర్వం నోరి దృష్టి ప్రహసనాలమీదికి విస్తారంగా ప్రసరించేది. ఆ స్వభావం క్రమేపి కవిత్వంలో చచ్చిపోయి మాటలో మాత్రం మిగిలింది.

సాహిత్యంలో విప్లవం రావటానికి అప్పు డప్పుడే సూచనలు కనిపిస్తున్నాయి. రాయ ప్రోలు 'కావ్యావళి' ప్రచురించి

"కొమ్మలమీది కోయిలలు
కుతుకలెత్తి స్వతంత్రభావనూ
త్రమ్ముల కట్టసాగి మమ
తన్ ప్రణయాంబర చిత్రశాలలున్
కమ్మని జీవితానుభవ
గాథలు స్వాదుకథాపదేశమా
ర్గమ్ములు కర్ణరంజకము
గా వినిపించెడు నేడు భారతీ!"

అప్పటికే ఉచ్చకంఠంతో వినిపిస్తున్నాడు.

అబ్బూరి, బసవరాజు నవ్యసాహిత్య క్షేత్ర ములో నూతన పంథాలను తొక్కిన కవితాకర్షకులు.

ఇంతలో 'సాహితీ సమితి' పుట్టింది. ప్రాచీన సాహిత్య మార్గంలో నడుస్తున్నా మని చెప్పుకుంటూ, సాముగరిడీలు చేసే అవధాన కవులమీద, వారి కవితా పద్ధతులమీద తిరుగుబాటు చేసి నూతన వ్యక్తిత్వాన్ని తెలుగు సాహిత్యానికి కట్టిపెట్టాలనే ఉత్సా హంతో ఉన్న కవిమిత్రులు సభ్యులుగా చేరారు. వీ రందరిలో ఒక కట్టుబాటు ఉండేది. స్నేహాభావంలోని ఆర్ద్రత సభ్య త్వానికి ప్రథమ లక్షణం. కేవలమూ కవులకే కాకుండా చిత్రకారులకు, కథకు లకు, విమర్శకులకూ సమితిలో స్థానం ఉండేది. వివిధ సాహిత్య భాండారాలను,— నూతన రచనలతో పాటు—కొల్లగొట్టి తమవశం చేసుకోవాలని సభ్యులు ఆశ యంగా పెట్టుకున్నారు. కొందరు కొందరు కలసి ఒక్కొక్క సాహిత్యాన్ని నేర్చు కున్నారు. సమితి ప్రథమ సభ్యుల్లో నోరి ఒకడు. సమితిలో ఉన్న ఇప్పటివా ళ్ళందరి లోకీ చిన్న వాడు.

కవి మిత్రుల స్నేహం వల్ల నోరిలో 'కవి త్వపు పిచ్చి' వృద్ధి కాజొచ్చింది. ఆయన కవితాజీవితంలో ఆ రోజులు ఒక Impressionable Age. ఏ విషయం కవిలో ఉద్రేకం కలిగిస్తే అదల్లా కావ్యమై కూర్చుండేది.

నేటి ఆంధ్ర సాహితీ లోకంలో సంస్కృతాంగ్లాంధ్ర సాహిత్యాలను విశేషంగా జీర్ణించుకున్న వాళ్లలో నోరి ఒకడు. కన్నడంలోకూడా కొంత కృషిచేశాడు. ఆయన కలం కేవలము పద్యాలు వ్రాయటంతోనే ఆగిపోకుండా వివిధ సాహిత్య శాఖలను అనుసంధించుకున్నది.

తెలుగు సాహిత్యంలో చెప్పుకో తగ్గ కొన్ని కథలు వ్రాశాడు. ఆయన 'పీరునికథ'లోని టెక్నిక్‌లో ప్రత్యేకత ఉన్నది. కథంతా స్వగతము (Dramatic Monologue) నడిచే పద్ధతిలో నడిచింది. వచన నాటికా రచయితలలో తనకొక ఉన్నత స్థానాన్ని కల్పించుకున్నాడు. ఆయన పద్యకావ్యాల కన్నా వచననాటికలు - సోమనాథ విజయము - క్షేమాభిక్షుని - పతంగయానము పఠితలదృష్టిని ఎక్కువగా ఆకర్షించాయి. ఈ మధ్య 'భాగవతావతరణము' 'షణ్ణవతి' వంటి పద్యగీతి నాటికలు కూడా వ్రాయటము ప్రారంభించాడు. విమర్శనా విషయంలో ఆయన తీవ్రవాది. ఉపదేశాత్మకత లేనిదే కవిత్వం చెప్పకూడదని ఆయన మతము. అంతమాత్రముతో వచ్చే రచనల నన్నిటినీ త్రోసిరాజనడు. ఏమాత్రము గుణమున్నా గ్రహించి మెచ్చుకొని తీరుతాడు.

నోరిఖండకావ్యాలు కొన్ని కలిపి 'గీతమాలిక' అనే పేరుతో సాహితీసమితివారు ౧౯౨౧లో ప్రచురించారు. మొదట దీనికి 'రసాల'మని నామకరణముచేసి తరువాత ఏకారణమువల్లనో మార్చారు. అందువల్లనే గీతమాలికలోని 'శివశంకరునకు' అనే కావ్యంలో—

'నా వనమ్మున దోహదసేవ నీవు
సాదరమ్ముగ జూచు రసాలశాఖ'

అని కనబడుతున్నది. నవ్యసాహిత్యంలో ఆ నాటికి ప్రచురణ అయిన గ్రంథాలు: రాయప్రోలు కావ్యావళి ౧౯౧౬-౧౮; అబ్బూరి మల్లికాంబ ౧౯౧౭: బసవరాజు సెలయేరు ౧౯౧౬; ఊహాగానము, పూర్వప్రేమ ౧౯౧౯. ౧౯-౨౦ సంవత్సరాల్లో ఏమీ ప్రచురణ కాలేదు. నోరి—శారద, సఖి, భారతి, ప్రతిభ మొదలైన పత్రికల్లో గీతమాలికతరువాత వ్రాసిన మరికొన్ని ఖండకావ్యాలు ప్రచురించాడు. గీతమాలికలోని కావ్యాలన్నీ కవికి పందొమ్మిదేండ్లు నిండక పూర్వం వ్రాసినవే.

నోరి ఖండకావ్యాలన్నీ ప్రకృతి, ప్రేమ, భక్తి, మైత్రి, జీవితాలకు సంబంధించినవి. కొన్ని చరిత్రాత్మకమైన కథలు.

ఖండకావ్యాలుగా చెప్పిన కథలకు మూలము బౌద్ధ,గ్రీకు చరిత్రలు. కవి అయిదో ఫారము చదువుతుండగా 'Children of the Dawn' అనే గ్రీకుపురాణకథల మీద అపేక్ష విస్తారంగా కలిగిందట. అప్పటినుంచీ కనపడ్డ గ్రీకుకథల్లా చదివాడు. ట్రోజను యుద్ధకథలు కవి మనస్సులో బాగా నాటుకొన్నవి. తరువాత Derby హారోమరు

భాషాంతరీకరణము, Long వ్రాసిన గ్రీకు కథలు చదవటము సంభవించింది. Bury మహాశయుడు వ్రాసిన గ్రీకు దేశచరిత్ర చదివిన రోజులలో ఎన్నో కథలు ఆయన కవిత్వాన్ని ఆకర్షించాయి. రోమను చరిత్రకు గిబ్బను మహాశయుడు ఎటువంటివాడో, గ్రీకు దేశ చరిత్రకు బ్యూరీ అటువంటి వాడు. ఆ రెండు దేశచరిత్రలు సాహిత్య శ్రేణిలో పరిగణింపబడుతున్నవి. ఈ కృషికి ఫలితమే గ్రీకు చరిత్రకు సంబంధించిన గీతమాలికలోని, ఏయసు, ఈసను, జ్యూసు కావ్యములు. ఆధునిక ఆంధ్రకవులలో గ్రీకుతత్వాన్ని అవగాహన చేసుకొని వారి వస్తువుతో కావ్యాలు చెప్పినది ఈయన ఒక్కడే. మహాకవి హోమరు రచనాపద్ధతిని తన కావ్యాలల్లోకి తీసుకు రావాలని ప్రయత్నము చేసి చాలావరకు సఫలీకృతుడైనాడు. నోరి మీద గ్రీకు వాఙ్మయ ప్రాబల్యాం విషయాన్ని శ్రీ శివశంకరశాస్త్రి 'నాలోమాట్పలో' 'గ్రీకు వాఙ్మయం చదువుతున్న రోజుల్లో నోరి నరసింహశాస్త్రి అందులో కథావస్తువులు కొన్ని స్వీకరించి ఖండకావ్యాలు చేశాడు. ......నా కంటే అతను గ్రీకు (Spirit) బాగా గ్రహించాడేమో ననిపించింది' అని వ్రాశారు. నోరి గ్రీకు కథల్లో గ్రీకు పురాణకవిత్వానికి ముఖ్య గుణాలు— సౌలభ్యము, అవక్రత, వాస్తవికత (Realism) పట్టుకొని వచ్చాడు. బుద్ధదేవుని సర్వసంగ పరిత్యాగానికి సంబంధించిన కథ 'వినిర్గమనము'. గ్రీకు కథలలో కన్నా దీనిలో కవి కళాతత్పరత బాగా కనిపిస్తుంది. ప్రకృతిని నేపథ్యరచనకు కవి రసోచితముగా వాడుకొన్నాడు ఈ 'వినిర్గమనము'లో. ప్రకృతితో ఏదో ఒకవిధమైన సంబంధం లేని కవి అరుదు. కొందరు ప్రకృతిని దర్శించి పసిపిల్లలు ఆనందించినట్లుగా ఆనందించి, ఉన్నది ఉన్నట్లుగా వర్ణిస్తారు. ప్రకృతిలోని పదార్థజాలాన్ని కొందరు కవులు ఇంద్రియ సంబంధమైన వ్యామోహాన్ని పొంది ఆమె బాహ్యసౌందర్యాన్ని అభినందిస్తారు. వస్తువు కనుగుణమైన ప్రకృతిస్థితిని తీసుకొని నేపథ్య చిత్రణము చేస్తారు కొంతమంది. ఉపమా రూపకాలంకారాలకు ఉపయోగించుకొని అంతతో ఆమెకు స్వస్తి చెబుతారు కొంతమంది. ప్రకృతిలోని అతీంద్రియమైన శక్తిని గ్రహించి జగదేక మాతగా పూజిస్తారు కొంతమంది. ఆమె చిత్రరూపాన్ని సర్వే సర్వత్రా దర్శిస్తారు. వాత్సల్యభావంతో ఆ మహాశక్తి పాదాక్రాంతులై ఆమె అపాంగావలోకనాన్ని ఆకాంక్షిస్తారు.

నోరి మొదట ప్రకృతిని ఒకజవ్వనిగా దర్శిస్తాడు. 'పూర్ణచంద్రుడు ఆమె ముఖము, సాంద్రచంద్రిక హాసము. లసితజలధరులు చూర్ణకుంతలాలు, కాలగగనము సుందర కైశికము. దినమణి చారు విస్తారమైన ఆమె కేశపాశంలో సహస్ర కాంతులతో ప్రకాశించే దివ్యమణి. 'కృష్ణవేణి'—



'ప్రకృతి రమణీయ హరితవస్త్రంబు గట్టి
మంజు మంజీర మధుర నిస్వనముతోడ
ప్రియుని దర్శించుమతి త్రపామంథరముగ,
పోతూ ఉన్న ఒకముగ్ధమాదిరిగా కనపడ్డది. ఇంకో తడవ—

'ప్రకృతికాంత వసంతదర్శనము కలుగ
ప్రియుని సంప్రీతితో నాదరించుకొనుటకు
చిగురుచీరె ధరించి విచ్చేసె నెదురు'

అని వాసకసజ్జికమాదిరిగా కనపడ్డది. అంటే ఆనాటికి కవి ప్రకృతిలోని కేవల బాహ్య సౌందర్యాన్నిమాత్రమే చూడగలిగాడన్న మాట. తరువాత 'మైమరపు' వ్రాసేనాటికి ఆమె తల్లిగా కనిపించింది. అప్పటికి కవి ప్రకృతిమాతముందు తనశక్తి తానెరుంగని బాల్యావస్థలో ఉన్నట్లుగా కనబడుతాడు—

'ఇపుడు నే నున్న చోటి వస్తువుల నెల్ల
జిన్ని నీ యూర్మికరముల నెత్తిపట్టి
లీల మొసరించి నీలోన నీవు పోవు
చోటులను జూపి అందందు త్రిప్పుచుండు
అట్లు వనుగూడఁ ద్రిప్పి ముదంబుగూర్పు'

అని చిన్నపిల్లవాడు తల్లితో ఎక్కడికో తీసుకు పొమ్మని గునిసి, తీసుకుపోతానంటే పట్టరాని సంతోషంతో గంతువేసి కేక వేసే టట్లుగా కృష్ణానదీ సైకతాలల్లో వెర్రిగా తిరిగాడు. ఈ స్థితిగతులు 'ఉద్బోధము' నాటికి మారిపోయినవి. అప్పుడు ఆయనఒకకొత్తసత్యాన్ని కనుక్కున్నాడు—

"సంద్రమున సూర్యులో నాకసమున గాలి
చుక్కలను, చందమామలో జూడవచ్చి
పక్షిజీపంబులోన వెన్నెల...లోన
ఊరి దంపతులలో కుటీరమం...
స్థిరపడిన గొప్ప ప్రకృతిచిత్ర...
కానగావచ్చె - నాలోన కానవచ్చె
ప్రత్యణువునందు సైతము ప్రకృతి యెల్ల
నిమిడియుండుట ఇప్పుడే యెరిగినాడ
ఇంతవరకును పుట్టంధు వట్టులుంటి"

అని చెప్పాడు. ఈ పరిజ్ఞానము అందరికీ కలుగదని గీతలో పరమాత్మ 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్' అని చెప్పినట్లు—

'ప్రకృతి మహనీయ రూప మెల్లెడల కలదు
కనులు గలవారు మాత్రము కాంచగలరు.'

అని విశదీకరించాడు. మహాకవి A.E ప్రకృతిలో ఇట్టి సైచిత్ర్యాన్ని జూచినపుడు—

'One Thing in all things have I seen
One thought has haunted earth and air.

అని అన్నాడు. ఆంగ్ల సాహిత్యంలో వర్డ్సువర్తు కవికి ఈ అనుభూతి చిన్ననాడే కలిగింది. యౌవనంలో కవికి ప్రకృతి సంబంధం తగ్గిపోయింది. దానికి కారణము 'హరారావహ సవ్యథవ్య వివిధాశయముల్ మధుర ప్రయత్నముల్'. కొంత కాలానికి చిత్తవృత్తిలో మార్పు కలిగి మళ్ళీ ప్రకృతి మాతను మోహాంధుడైన నీ కుమారుణ్ణి తిరిగి ఏలుకోవలసిందని ప్రార్థేయ పడతాడు. ప్రకృతికీ తన జీవితానికీ ఉన్న సంబంధాన్ని ప్రకృతి కవిత్వాన్ని మానినందుకు బాధ పడుతూ చెప్పిన 'పునరావర్త'మనే ఖండకావ్యంలో ఉట్టంకించాడు.

ఇది మహాకవి వర్డ్స్‌వర్త్ 'టిన్‌టర్న్ అబీ' మీద చెప్పిన కావ్యం వంటిది. అందులో—

'శైశవవేళ బాల్యమున
  శాంతవిశృంఖల సాధువృత్తి నీ
శల రమ్యగర్త పద
  స్థితి నెప్పుడు విశ్రమింతు క్షో
ణీశనుడైన యర్భకుడ
  నారత మంబయునేస్థలంబునన్
లేశము చింతలేక పవ
  ళించి సుఖించు మనోజ్ఞ వైఖరిన్'

'పల్లవ పుష్పకోరకిత
  భాస్వరరూపము దాల్చి నీవు శో
భిల్లు వసంత దివ్యతర
  వేళ లతాగ్రము లెక్కి యూగి యు
త్ఫుల్లమనంబుతో పికము
  ముద్దులపాటల నాలకింతు, నీ
వల్లన శ్రాంతి వా శిశి
  మందున నేనును విశ్రమించెదన్.'

'ఈ విధినెల్లకాలము గ
  తించిన మేలయి యుండుగాని యిం
కోవిధమయ్యె దైవగతి
  యెయ్యెడ శైశవబాల్యముల్ చనన్,
యౌవన మంకురించె, హృద
  యంబున వెంటనె మొలకలెత్తె హా
ర్షావహ నవ్యభవ్య వివి
  ధాశయముల్ మధురప్రియత్నముల్.'

'తల్లి, క్రమంబుగా స్మృతి ప
  థంబున దూరము కాదొడంగె యు
న్మల్లలితామలాకృతి, ప్ర
  సన్నములై రుచిరంబులై సుధా
వేల్లితముల్ ప్రతిక్షణావి
  వృద్ధములై నవసౌఖ్యరాజి భా
సిల్లె త్వదాఖ్యయే నిరవ
  శేషము నామది విస్మృతింపగన్.'

'ఆ కలకంఠ కంఠ నిన్నృ
  తార్ద్రి కుహూధ్వని నన్నినాళ్ళకున్
నీ కరుణాస్వరంబు విన
  నేర్చితి, నావిధ మన్నినాళ్ళుగా
నాకయి కంఠ మెత్తి కరు
  ణంబున బిల్చితివో అనూనమా
నీకృప నీమహత్వము గ
  ణింపదరంబె కృతజ్ఞబుద్ధికిన్'

అని ప్రకృతికి విన్నవిస్తాడు. కవిలోని తాత్విక దృష్టి అభివృద్ధి అవుతున్న కొద్దీ ప్రకృతిలోని స్థిరత్వాన్ని, మానవ జీవితంలోని అస్థిరత్వాన్ని గ్రహించాడు. 'కృష్ణవేణి' కవిని చూచి 'ఏదీ నాతో పాటు కాస్త పొంగు' చూతా మని అంటే—

'ఈ ఆషాఢ నవాంబుదార్భటులతో
  నేకశ్రుతిం గల్పి త
ల్లి, ఈరీతిగ నిత్యయౌవనసుధా
  శ్రీరాగ మాలాపనల్

చేయంజాలితి వెన్నిమారు లిటులన్
జీర్ణించు నా బోంట్లకుల్
ప్రాప్తియం బింత చిగుర్ప నేరితివె అం
బా, కృష్ణవేణీనదీ !

'నిన్నా మొన్నటిదాక ఎండలను ఎం
తే జాలిగా జాలుగా
నున్నా వోపిక లేక నాకువలెనే
ఒక్కుమ్మడిన్ నేడు సం
పన్నాత్మీయమహాప్రవాహమున సి
వ్వాలాడుచున్నావు, నే
ని న్నీనాడును పోలి పొంగగల సం
టే తల్లి! కృష్ణాపగా!

'నీ కూలంకషవాఃప్రపూరమున నె
న్నే బిందువుల్ గల్గునో
నీ కన్నెల్లి వయస్సు లేదటవె వీ
నిం జూడు షట్త్రింశకుల్
వాకల్ కట్టుచు పొంగి పొంగి మరలన్
వర్షంబు వర్షంబునన్
నీ కౌమారము చాలదే, ఇతడు క్రీ
డించెంగదే అప్పుడే'

అని ఆమెను తనకు కౌమారాన్ని తిరిగి ప్రసాదింప వలసిందని ప్రార్థించాడు.

పుష్పబాణ విలాసము, అమరుక శతకము, శృంగార శతకము, అలంకార గ్రంథాలలో నాయకులకు సంబంధించిన శ్లోకాలూ చదవగా, అవి నోరిహృదయాన్ని ఆకర్షించాయి. వాటి అస్పష్టపరిభావం మనస్సులో ఉండిపోయి అంతస్సులో కలిగిన ప్రణయభావాలు నాయికా భావంలోకి మారి ప్రథమరాగము, రాగభయము, జన్మసాఫల్యము, గర్వార్పణము, రాకసప్రేమ, నూతన క్రీడ, పరాజయము, అజ్ఞాతబంధము, విభ్రాంతి, ఘాతుకప్రియసమాగమము—ఇత్యాది కావ్యాలుగా పరిణమించాయి.

'ప్రథమ రాగం'లో నాయిక అబల, సుకుమారి. ఇతఃపూర్వము ప్రేమబాధ ఎరుగనిది. ఆమె హృదయంలో రాగచింత కలిగించాడు గాని నాయకుడు తాపాన ఆమె మనస్సు కలవర పెట్టాడు. అప్పు డామె నాయకునితో.

'రాజిత విచిత్రచిత్ర నిర్మాణకుశల
హిమసుధాస్వచ్ఛ మగు నస్మదీయహృదయ
కైరవదళంబులం దీవు కరుణ మాలి
రాగరేఖల గాఢత వ్రాయు టేల ?

.............................

భావి సుఖలబ్ధి కిట్టులు బాధపడుట
అబల సుకుమారి నాకు సాధ్యంబె చెప్పుమ'

అని దీనాతిదీనంగా తన అవస్థను వెళ్లడిస్తుంది.

మధురమైన లజ్జను త్యజించి నాయకునికి సంతుష్టి కూర్చటానికి ఎంత ప్రయత్నించినా నాయకుని మనస్సు ఆమె మీదికి ప్రసరించలేదు. అప్పుడు 'గర్వార్పణము'లో నాయిక –

'గాఢ చిరసంగతిని మమైక్యంబు గన్న
విపులగర్వముకూడ నర్పింపవలెనె,
హృదయవేదన కన్నీరు వదలవలెనె,
ప్రేమకఠినాంతరంగ, నా హృదయనాథ'.

అని నాయకుని దూరుతుంది. కాని ఆమె హృదయంలోనుంచి అతనికి ఉద్వాసన చెప్పలేక 'నా హృదయనాథ' అని సంబోధించి చల్లబడి పోతుంది. 'రాగభయం'లో నాయిక చిత్రమైనది. నాయకుడు ఆమె యెదుట నిలవబడినంత మాత్రాన్నే ఆమె ఎడద దడదడ మంటుంది. మనసు భయ విహ్వలతతో మైకం క్రమ్మి పోతుంది. అతడు నాలుక కదిల్చితే ఆమె నాలుక తడియారి గొంతులోని స్వరము కుంభించి పోతుంది. అతను కౌగిలిలో చేరిస్తే సివమెత్తి అరుస్తుంది. నాయకుని ఉన్నతికి తగిన దానిని కానేమోనని ఆమెభయము. నాయకునిసుఖానికే తన సర్వస్వాన్ని అర్పించి అతని ఆనందంలోనే తన జన్మకు సాఫల్యమున్నదని భావించుకుంటుంది 'జన్మసాఫల్య' నాయిక. 'రాక్షసప్రేమలో' నాయిక ప్రమాదకరమైనది.

'నన్ను ప్రేమిస్తివా నాహృదయ మమృతమ్ము
కాదేని నాయెడద కఠినవజ్రమ్ము!
నన్ను మమతం గన్న నాయాత్మ నీదాసి
మీరుచో నీపాలి మృత్యుదేవతను'

అని నాయకుని బెదరించి ఆత్మసుఖాన్ని చూచుకుంటుంది. 'నూతనక్రీడ' లోని నాయిక ప్రియుని అభిమతాన్ని అనుసరించేది. అందులో కలిగే తన బాధనుకూడా లెక్క చెయ్యదు.

'పెదవి కదపక, నవ్వక ప్రీతి గదుర
అరయ కిటువైపు ఫుల్లనేత్రాంబుజముల
ఇపుడు నీ వాడు లీల బాధించె నన్ను
ఇదియె ప్రియమైన నటులె కానిమ్ము నాథ!'

అని చెప్పుకుంటుంది. విరహతాపాన్ని బిగ్గబట్టిఉన్న నాయికను నాయకుడు వచ్చి లాలిస్తాడు. 'కంఠసంశ్లేషణము' శిథిలము కాగానే,

'అరయక భవన్ముఖాబ్జంబు శిరము వాల్చి
ఫాలభాగము నీభుజోపరి శయింప
అశ్రుధారల నీకు పూజార్పణమ్ము
చేయు నను గాంచుకొనుచును సిగ్గుపడితి'

అని తన చేష్టకు తానే సిగ్గుపడుతుంది. 'విభ్రాంతిలో' నాయిక యౌవనంలో నాయకుని రూపరేఖావిలాసాలను చూచి మోనపోయి తరువాత పూర్వస్థితి అంతా కలవరమని అనుకొంటుంది. 'ఘాతుకప్రియ' లోని నాయిక నాయకుని దుష్టత్వాన్ని గ్రహించి

'నీ చిటుతనవ్వు భ్రాంతి నందించి ఎదను
లేనిపోనియాశలు చిగురింపజేయు
మంచు తొలగును శశి యుదయించి తోచు
అంతలో నీముఖంబు హిమాద్రి యగును.'

'తీవ్రతృష్ణాతురుని మృగతృష్ణ వోలె
చపలమత్స్యాంగనల నామిషంబురీతి

నీ సుమమ పేశలాకృతి నీ మృదూ క్తి
బలిమి కర్గించి నాదు దర్పము హరించు'

'శాశ్వత విసర్జనేచ్ఛనై సాగునంత
అడుగు కదలక దారువై యట్టె నిలుచు
ప్రాణఘాతుక యను కొన్న ఫలిత మేమి
ప్రాణనాయిక యనినోట వాక్కు వెడలు.'

అతను వస్తే ఏమీ అనలేక తనహృదయాన్ని అతనికే అర్పించి ఊరుకుంటుంది.

'ఆత్మార్పణము' శ్రీ శివశంకర శాస్త్రి హృదయేశ్వరికి నాయికాపక్షంగా నారి ఊహించిన జవాబు. కవికి సంయోగం కన్నా వియోగమంటే ఎక్కువ ఇష్టము. 'ఎడబాటు' అనే కావ్యంలో—

'ప్రేమ! నీతోడ నైక్యమ్ము నొందుకంటె
నధికమధురిమ గల దెడబాటునందు'

అని పాడాడు. 'ప్రేమ గీతములు' 'ప్రియాతిశయోక్తి' ఈశ్రేణికి చెందినగీతాలు. ఇలా కవి నాయికలోని మానసిక వైవిధ్యాన్ని రకరకాలుగా ఊహించి చిత్రించాడు.

ఈ ప్రేమగీతా లన్నిటిలోనూ ఒక మూల సూత్రి మున్నట్లు కనిపిస్తుంది. భక్తిరసము లోని పంచభావాలలో మధుర భావము ఉత్తమోత్తమము. కవి హృదయంలో ఆ భక్తి రససంబంధమైన మధురభావన నిలచి దాని సుస్పష్టరూపాన్ని ప్రతిగీతలలోనూ ఒలకబోసుకుంటున్నది. మైత్రి విషయంలో కవి వ్యక్తిలోని ఉత్తమగుణాన్ని గ్రహిస్తాడు. లోక మే మనుకున్నా ఆయనకు లెక్కలేదు.

నీచ కఠిన కూ్రర నింద్య కర్ముడవైన
ఇంక నేమి యైన నేమి, నేడు ?
ఒక్కవేళ నీవు నుత్తమోదాత్తాత్మ
నెరిగియున్న నేను మరువ దాని'—

అని నింద్యవర్తనుడైన మిత్రునితో గూడ స్నేహం చేస్తాడు. 'మిత్రుని స్ఫురణ' అనే కావ్యంలో-

కాల మేఘుచ్ఛన్న తమస క
రాలమైన యమూస నిశకున్
హ్లాదినీప్రభ బోలు దృష్టికి
నీదు దర్శనము ——

అని ఉప్పొంగి పోతాడు. స్నేహితుడు కోపగించి ఏమన్నాగాని సహించటానికి సంసిద్ధపడతాడుగాని వెనుతిరగడు. అతని ఆర్ద్రతకు అవతలి వాళ్ళే కరిగి పోతారు. 'వీర పరిష్వంగం'లో-

'జలజలని మోదబాష్పముల్ జాలువార
నిశ్చలకరమ్ముతోడ ఈ నిశితఖడ్గ
మిచ్చుచున్నాడ నిదె వధియింపు నన్ను
నచ్చెలీ! క్రోధ మింక పోనేరదేని !'

అని ధీరుడై నిలిచినప్పుడు స్నేహితుడు లొంగిపోతే-

'పులకిత మదీయగాత్ర ముప్పొంగె, నకట,
భానురాయుధ మటు పారవేసె దేల ?
ఏల భరముగ నను కౌగిలించె దోయి'!

అని ఆదరిస్తాడు. 'ఆశాకిరణము, భిన్నమైత్రి, మిత్రప్రతిష్ఠ, మిత్రవియోగము'—మొదలైన కావ్యాలు మైత్రికి సంబంధించినవి. మైత్రి ఏర్పడే మొదటి రోజుల్లోనే మిత్రుని రూపాన్ని హృదయంలో సృష్టించుకొని మిత్రుడు తప్పేదైనా చేసినా అతని నిజ స్వరూపాన్ని—హృదయంలో సృష్టించుకున్న దాన్ని—చూచి వెనక్కు తగ్గుతాడు. మిత్రునికి తనకూ భేదభావం కలిగినప్పుడు 'సర్వజ్ఞస్వామి'కి నివేదిస్తాడు.

బాల్యావస్థలో కవి ప్రతివస్తువును కవితా చక్షువులతో చూచి ఆనందించేవాడు. ఆయనలో తాత్వికదృష్టి అభివృద్ధి అవుతున్న కొద్దీ ప్రతివిషయమూ ఏదో గొప్ప వ్యక్తిత్వంతో కనపడేది. చిన్నప్పుడు వ్రాసిన 'బూచి' అనే కావ్యం ఊహా ప్రధానమైనది. ఆరు వత్సరాల కుర్రవాడు,

'ఎండుటాకులు త్రొక్కుచు నెగిరి యెగిరి
చిన్నివాడందు తనచేతి చిన్ని వ్రేళ్ళ
జీటిమాటికి కురు లెగజిమ్ముకొనుచు
కుప్పలుగ గొన్ని పర్ణముల్ కూర్చుచుండె'

తరువాత ఆపసిపిల్లవాడు చిన్నపిట్ట ఈకను చూచి దానిని నోటితో ఊది ఎగరవేసి, దానివెంటనే కొంతదూరముపోయి అదివిచ్చి విచ్చని మొగ్గలో చిక్కుకుంటే రెంటినీ విడదీయలేక కలిపి గాలిలో వదిలిపెట్టాడు. ఇంతలో తీవ్రపవనుడు వచ్చి అతని కవి కన బడకుండా చేస్తాడు. పిల్లవాని మనస్సు ఇంతలో వేర్వేరు క్రీడలమీదికి పోతుంది.

ఈ చిన్నకావ్యం మానవజీవితానికి సంబంధించిన ఒక సత్యాన్ని ప్రకటించే శక్తిని (Revealing effect)తనలో దాచుకున్నట్లు కనిపిస్తుంది. మహాకవి షేక్స్పియరుఅన్న

"Life is but a walking shadow; a poor player,
That struts and frets his hour upon the stage,
And then is heard no more; it is a tale,
Told by an idiot, full of sound and jury -
Signifying nothing."

అనేసత్యం ఈ కావ్యంలో గర్భీకృతమైనట్లు ప్రస్ఫుటమౌతుంది. 'నిర్యాణ' మనే కావ్యంలో జీవితములోని ఒక వైచిత్ర్యాన్ని కవి సూచించాడు. ఒక్కొక్కప్పుడు ప్రచండశక్తిమంతుడైనమానవుడు ప్రకృతికి లొంగి పోవలసిందేనా? విజయము అతనికి ఉందా లేదా!అనే భావపరంపరలో మునిగి పోయి అహంభావం రేకెత్తి-

"అలల వేగము తెడ్డ త్రోయుము
చండపవను వశీకరింపుము
పడవ నడపు తృణీకరించుచు
ప్రకృతి ఘనశక్తిన్
"అబ్ధి యెంత గంభీరమైనను
అందు తేలగ తెప్పయున్నది
పడవ యొరగదు, పడవ మునుగదు
పడవ పగులనిది!"

అని ప్రబోధించటముకూడా కద్దు. కానీ ఈ అహంభావము సర్వకాల సర్వావస్థలలో నిలిచేదికాదు. 'కాలధిక్కృతి'లో

'ఏమాత్రంబు భవత్ప్రతాపమహిమం
బిచ్ఛాగతిం గాంచగా
లేమింగాదు మదీయజృంభణము; స్వ
ల్పీయంబు నాశక్తియౌ
నామాటల్ శమియించుగాక నిల సం
చారంబులో నింతలో
నేమాయెన్ హృదయంబు నిండిన పవి
త్రేచ్ఛల్ సుహృద్భావముల్'

అని పావిత్ర్యము, సుహృద్భావాలతో నిండిన జీవితము ఏమైనా ప్రమాద రహితమైనదని అన్నాడు.

'జన్మముతోడనె జాతం బైనది
జనులకు మృత్యువు జగతిని

* * * *

ఒక్కముహూర్తం బెక్కువ బ్రతుకగ
బిక్కమొగం బిడనేలా?
ఒక్కముహూర్తం బెక్కువ మనుటకు
టక్కరిమాట లవేలా?

* * * *

చిరకాలమ్మును జీవింపగ ధర
జీవసిద్ధులము కాము.
కీర్తికాయముల క్రీడింతుము బహు
గ్రీష్మకాలముల మేము.'

అని చెబుతూ చావు తప్పదని ఎరిగినప్పుడు ఉన్నంత వరకూ అనుభవిద్దామని ఉమర్ ఖయ్యాము మతాన్ని సూచించలేదు. జీవితానికి తరణోపాయాలు సత్యము, ధర్మము పావిత్ర్యము, అని ఆయన ప్రబోధము.

'జన్మంతా ఒక పవిత్ర యజ్ఞం
చావందులో పూర్ణాహుతి'

అని ఆయన నిశ్చితము. పూర్ణాహుతికి ఫలితము తప్పక రాబోయే జన్మలోనైనా వచ్చితీరుతుంది. అంటే మృత్యువు రాబోయే జన్మసంస్కారానికి సహాయకారి అన్నమాట. బ్రౌనింగు మహాకవి కూడా 'మృత్యువు జ్ఞానకక్ష్యాంతరాలల్లో దీపికను చూపించే దాసి' (Death is a groom that brings taper into the outer world) అని చెప్పాడు. నోరి జీవితంలో నిరుత్సాహం ఎరుగనివాడు. ఎన్నటికీ లేనివాడు, రానివాడు. ఇంకో కావ్యంలో-

"పసివేళటి పాలనునుపు
ఎల్ల ప్రాయపు ఏటిపొంగు
ఇంకి పో లేదీ
ఎదలో సుస్థిరముగ
పదిలమైనా యోయ్."

అని తన నిత్యనూతనత్వాన్ని గురించి వ్రాసుకున్నాడు. నోరి కర్మకాండతోపాటు భక్తిభావాన్ని కూడా తనలో పెంపొందించుకున్నాడు. 'జగదేకమాత, సర్వజ్ఞస్వామి' ఇద్దరే ఆయన కారాధ్య దేవతలు. వారి రూపాలనే వివిధ దేవతలలో కవి చూస్తాడు. 'వేంకటేశార్పణము' అనే కావ్యంలో దీనంగా స్వామితో తన అజ్ఞానాన్ని మోహాంధతను చెప్పుకొని ఆయన వాత్సల్యము అపార మని, అజ్ఞేయము, అచింత్యము నని పొగడినాడు.

'నీ సేవార్థము నీ ప్రతిష్ఠ సలుపన్
నిర్మించుకొన్నావు నీ
ప్రాసాదంబుగ ఈ శరీర మని నే
భావింపగా లేక వే
రాస న్నాదని యెంచి ఆత్మసుఖమే
యాశించి యత్నించి ఆ
యాసం బందితి దాన దేహ మపవి
త్రాత్మంబు గావించితిన్'

అని తన తప్పిదాన్ని దాచిపెట్టకుండా భగవంతునితో వెళ్ళగక్కాడు. భగవత్సాన్నిధ్యము ఒకప్పుడు సన్యస్తభావము కూడా ఆయనలో ప్రకోపించింది—

'నా యజ్ఞానము గర్వమున్ కలుషమున్
నానాటికిన్ వృద్ధియై
మాయన్ లేక మదిన్ శిరోగ్రమున ని
మ్మాడ్కిన్ ప్రసారించె నే
మా యస్వించెడి దీర్ఘ కేశముల నీ
కర్పించితిన్ భక్తితో
నా యాకారవికారచింతనము స
న్యస్తంబుగా నాత్మలోన్'

అని పూర్వోదంతాన్ని కావ్యం చేశాడు. 'పరమేశ్వరి' 'కామేశ్వరి' అని జగదేకమాతను సంబోధించి ఆయన ధ్యానిస్తాడు. కామరహితునిగా చేసి పరోపకారబుద్ధి ప్రసారింపవలసిం దని ఆమె ముందు ప్రాధేయపడుతాడు.

'పగలు రేయును నపరాధబహుళతమ్ము
చేయు నను పుత్రబుద్ధి రక్షింపు మంచు
బాష్పగద్గదితాతుర పంక్తితోడ
విశ్వజనని ప్రసన్న'—కావించుకొంటాడు.

ఈ లోకంలోకి ఒక యాత్రికుడుగా వచ్చిన తన్ను రేవు దాటేయవలసిందని, కష్టాలకు క్రాగి పొయ్యానని

'ఓ నావ నడిపే వల్లెకారి
రేవు దాటేయరా!—అని కరుణంగా యాచిస్తాడు ఆ జగదేకపితను.

అనేకమంది కవులకు దోహదసేవ చేసినట్లే శ్రీ శివశంకరశాస్త్రి ఈయనకూ చిన్నతనంలో చేశారు. కానీ కవితావిషయంలో ఆయనప్రభావం నోరిమీద ఏమాత్రమూ లేదు. కవితారచనవిషయంలో ఇద్దరూ రెండు ధ్రువాలు. ఆ విషయం నోరి శ్రీ శివశంకరశాస్త్రికి వ్రాసిన ఒక ఉత్తరంలో ఇలా వ్యక్తీకరించారు—

"స్త్రీ విరోధి" చదివాను. బాగున్నది. కానీ అది భూలోకం దాటిపోలేదు. అది లోపమని నా ఉద్దేశము కాదు. కాని నీరచనలన్నింటిలో ఆగుణ మున్నట్లున్నది. దాన్ని ఏమనవలెనో తెలియదు. Realism అనవచ్చునేమో! అదిప్రధానముగా ఉంటుంది. నాకుమాత్రము రచనలు లోకాతీతముగా ఉండకపోతే తృప్తి ఉండదు. నా కాశక్తి లేకపోవచ్చును.

నేను క్రొత్తగా వ్రాసిననాటిక terminology లో ఆలోచిస్తే మన భేదము జటాయువు, సంపాతిది ఉన్నట్లుగా ఉంటుంది. సంపాతి

పెద్దవాడు, ఎక్కువ సమర్థుడు. అయితే భూలోకమువిడిచి పోవడానికి యత్నించడు. జటాయువు చిన్నవాడు, కొంచెము తక్కువ సమర్థుడు. కానిఊహాలు సూర్యమండలానికి పోతవి. జటాయువు బలవంతాన సంపాతి కూడా పతంగలోకయాత్రకు ఒప్పుకుంటాడు. జటాయువు కాలి పోబోతూఉంటే సంపాతి రక్షించి తనరెక్కలు కాల్చుకుంటాడు. పడిపోతూ ఇద్దరూ తనఅపాయము సంగతి ఆలోచించుకోరు. మన ఇద్దరికీ స్వభావాలలో వారితో పోలిక ఉన్నది.''

కొత్తకావ్యాలు చెప్పడంలోనూ, ఊహించడంలోనూ నోరికి ఉత్సాహం ఎక్కువ. 'పరకాయప్రవేశము' 'గాలివాన' 'మహిషాసురమర్దనము' 'పంచబాణము' ఇత్యాది కవితావస్తువులు ఇదివరకే ఆలోచించి ఉంచినవి, ఇంకా రూపం తాల్చలేదు. వాటిని చదివేభాగ్యం త్వరలో లభిస్తుందని విశ్వసిస్తున్నాను.

# ఆంధ్రప్రభుత

ఓ తెనుగమ్మ! నీవు కొలువున్న దినాల సభాంగణమ్ములన్
పూతగ పైడియున్ రతనముల్ తెలిముగ్గులుగా నమర్చి, భూ
నేతలు కొల్వవచ్చిరట నీ చరణమ్ముల; నీకు స్వస్తి వా
క్యాతురి పాడినార లట సామరవమ్ముల భూమిదేవతల్.

నీ నిడువాలు కన్నుగవ నీడల జాడల రాజ్యమొందిరి భో
జానియు కృష్ణరాయలును చల్లగ నేలిరి నేల నెల్ల; నీ
తేనియ తీయనౌ పలుకుతేటల సత్కవి నన్నభట్టు వి
ద్యానిధి కృష్ణరాయలును హాయిగ పాడిరి దివ్యకావ్యముల్.

బంగారమ్ములు పండె నీ ప్రభుతలో; ప్రాచీ ప్రతీచీ కుభృత్
శృంగమ్ముల్ వెలుగొందె నీ యశములో; భృంగీవినాదమ్ములో
సంగీతమ్ములు నీ గళస్వరము లశ్రాంతంబు మార్మ్రోగె; నీ
సింగారమ్ములలో సపత్నులకు నచ్చెన్ క్రొత్త క్రొత్తల్ రుచుల్.

సావిత్రీవ్యలసత్పపూర్వపుల తేజస్స్ఫూర్తి, ఓంకార వీ
చీ విన్యస్తమహామహత్వములు, దిగ్దిగ్భాగకళ్యాణకృత్
భావశ్రీలుగ నీ తనూజులుగదా బ్రహ్మర్షి దేవర్షులై
ఏవేళన్ భవదున్నతిన్ నిలిపినా రీరేడులోకాలలో.

ఏదమ్మా అలనాటి నీ సరస సాహిత్యాభిలాషమ్ము? వే
దా దివ్యమ్ము తపఃప్రభావమును; బాహాశక్తియున్, సత్కళా
వైదగ్ధ్యమ్ము, పతివ్రతామహిమమున్, ప్రఖ్యాత ధీయుక్తియున్
మా దారిద్ర్యముచే నశించినవి సుమ్మా నేటికాలానకున్.

# శనిదశ

అడుగుదీసి ముందు కిడినయంతలోన
కఠినపాషాణములు దీర్ఘకంటకములు;
అట్టె చూసి కన్నులు విప్పునంతలోన
ఘోరజీమూతములు అంధకారములును.

తలపు లేవేవొ మనసులోతులఁ గలంప,
ఆస లెన్నెన్నొ యెదదలో మోసు లెత్త,
నేనుగూడ రెక్కలుసాచి నింగి నెగురఁ
బోదు; కాని వెంటనె క్రుంగిపోదు నయ్యొ!

చెలిమికోసమై దరిజేరి పలుకరింప
అతిభయంకర సర్పదంష్ట్రాగ్నిశిఖలు;
వలపుటింటి ముంగిట నిల్చి తలుపుతట్ట
ఉగ్రతర పిశాచీ కంఠహుంకృతులును.

వెలుగు చీకట్ల సంజలో కలత నలత
నిదురరాక తెల్వియుఁగాక నిలుతునేను;
బరువుచే గుండె మనసంత వెరపుచేత
బడలి యడుగుసాగదు కన్నువిడదు నాకు.

సౌఖ్య మన్నదిలేదు ప్రశాంతి లేదు
పాడుపడిపోయినది నిండుబ్రతుకు నాది;
చేవలేక చాపగనైన చావలేక
ఎంతవరకో? ఈ జీవిత మెందుకొరకో?

శ్రీ శివరామం.

# కృష్ణవేణి

జనమంచి కామేశ్వరరావు

పర్యంకంబున
కృష్ణవేణితో,
చేయి తలాడగ
శయనించిన, నా
ప్రేయసి చేరితి
ప్రేమోత్సుకతన్.—

*

పెదవుల భృశమ్ము
మెరసే హాసం,
ముగ్ధవయస్వి
సుమమృదుహాసం,
ముత్యపుముడిమై
నిర్వృతి నుండెన్.—

*

దేహయష్టిపై
చూపె లేదు;
మన మూరకూరకే
వేణి వసించున్.
నేత్రద్వయ మొక
భృంగరాజమై
కుంతలాల మధు
పానము సేయున్.

*

అవశంబై నా
పాణిద్వయ మా
కృష్ణవర్ణమౌ
వేణిక నిమురుచు
కేశబంధనము
విదళించెన్.

*

వేణిబంధములోని
పాణిద్వయముపట్టి,
నిదుర జోగే కండ్లు
వాల్చుచూ నను౯ జూచె
మందస్మితాస్య, నా
సుప్రేమరాజ్ఞి!

*

చివురించిన
చిరునవ్వు మోముతో,
జీరాడిన కై శిక
పాతముతో,
నా మోము కప్పి
తన మోము చేర్చె
ననురాగరక్ష!
నాశ్లేషవృష్టి!

*

# సంపూర్ణాహుతి

పి. గణపతిశాస్త్రి

అంకితం : పరమమాహేశ్వరులైన శ్రీ ఇవటూరి నాగభూషణరావుగారికి!

## ౧

[అది కాంచీపురంలో సంపన్నుడూ పరమ మాహేశ్వరుడూ అయిన శశాంకమౌళి ప్రాసాదము. హర్మ్యం ముందూ, వెనుక భాగంలోనూ ఉన్న తమూ సాంద్రమూ అయిన ఒక ఉపవనము, ఆ వనంలో చలిస్తూ ఉన్న బిల్వ వృక్షాలమధ్యలో, సాయంకాల నీలకాంతులలో, చంద్ర బింబంలా మెరిసే ఆ ప్రాసాద శిఖరం, కొమ్మలలో మెదులుతూ ఉంటుంది. సమీపంలో ఉన్న మహేశ్వరాలయంలో నుంచి ఘంటాధ్వనులు వినబడుతూ ఉంటాయి. అప్పుడప్పుడు ఆ ఘంటాధ్వనులలో మిళితములైన జంగమదేవరల గంభీర శంఖ ధ్వనులు, భవన లోహ కవాటాలలో ప్రతిధ్వనిస్తూ సన్నంగా మారుమోగుతూ ఉంటాయి.

ఆ భవనం ముందువాలో ముత్యాల జాలరుల ఉయ్యాలలో సిరియాళుణ్ణి ఉంచి, తల్లి సర్వమంగళ జోల పాడుతూ ఉంటుంది. వెండి గొలుసులలో కదిలే ఆ ఉయ్యాలమంద్రధ్వని, ఆమె పాటకు శ్రుతిలా వినబడుతుంది.

దివ్య సౌందర్యంతో ప్రజ్వలించే ఆమె ముఖంలో వాత్సల్యమిశ్రితమైన భక్తిభావం గోచరిస్తుంది. అప్పుడప్పుడు మృదువుగా పాడుతూ ఆమె, సిరియాళుడు నిద్రపోయినదీ లేనిదీ పరీక్షిస్తూ ఉంటుంది. క్రమంగా చీకటులు క్రమ్ముకుంటున్నాయి. ఆ చీకటిలో ఆ ఉయ్యాల గొలుసులు తెల్లని జ్వాలల విధంగా కనబడతాయి. అప్పుడప్పుడు ఉయ్యాల ఊపినప్పుడు ఆమె కరకంకణాలు మృదువుగా ధ్వనిస్తూ ఉంటాయి.]

### ౧ పాట

ఓ బాల నటరాజ! ఓ సుందరేశ్వరా! జో జో!
ఓ మహాలీలా రచిత ఖేలనా! ప్రభు! జో జో!

అరుణాస్తమయ సుప్రభావగుంఠనవేష
ఆకాశలాస్యాంగణమున సంధ్యాయోష
నీ దివ్య నృత్యావసాన నిద్రావేళ
నీ నృత్యగళిత ముక్తామాలికల లీల
కర్పూరవిరచితాఖండదీపమ్ములన్
అర్పించె తారల దిశాంతాంతరమ్ములన్

ఓ బాల నటరాజ! ఓ సుందరేశ్వరా! జో జో!
ఓ మహాలీలా రచిత ఖేలనా! ప్రభూ! జో జో!

[ఆమె నిద్రించిన సిరియాళుని ముద్దు పెట్టుకుని అతని వైపు చూస్తూ నిలబడుతుంది. ఇంతలోనే దాసి మణికర్ణిక, ఆ సమీపంలో దీపిక ఉంచి, వెళ్లబోతూ ఉంటుంది. ఆ దీపకాంతి ఆ ఉయ్యాలగొలుసులమీదనూ, సిరియాళుని ఎర్రని పెదవుల మీదనూ ప్రసరించి, తళతళ మెరుస్తూంటుంది.]

సర్వ – మణికర్ణికా!
దాసి – అమ్మా!
సర్వ – అయ్యగారు ఇంకా రాలేదు. ఎక్కడికి వెళ్లారో!

---

* ఆల్ ఇండియా రేడియోవారి అనుమతిని.

దాసి – ఆశ్రమంలో ఆచార్యస్వామి దర్శనం చేసుకుని, దేవాలయంవైపు వెళ్లారేమోనమ్మా! అవిగో మంత్రపుష్పమంత్రాల ఓంకారాలు విన బడుతున్నాయి! అయ్యగారు వచ్చేవేళ కావచ్చిందమ్మా.

సర్వ – ఏమోగాని అబ్బాయి కలవరిస్తున్నాడు ఈవేళ. కొంచెము తొందరగా వెళ్లి వారిని తీసుకు రాగలవా?

దాసి – చిత్తమమ్మా – [నిష్క్రమిస్తుంది.]

సర్వ – జోలపాట.

ఓ బాలనటరాజ! ఓ సుందరేశ్వరా! జో జో.

[శశాంకమౌళి ప్రవేశంచును]

శశాంక – సర్వమంగళా.

సర్వ – ఆఁ. కొంచెము నెమ్మదిగా మాట్లాడండి. సిరియాళుడు నిద్రపోతున్నాడు.

శశాంక – ఇప్పుడేగదా, సూర్యాస్తమానమయింది. ఇప్పుడు నిద్రపోవడ మేమిటి!

సర్వ – ఏమోగాని, యీవేళ కొంచెము జ్వరం తగిలినట్టుగా ఉంది. ఎప్పుడూ లేనిది, ఇవాళ, మహేశ్వరాలయంలో శంఖధ్వనులు విని భయం వేస్తూంది అంటున్నాడు.

శశాంక – ఎందుచేతనో?

సర్వ – ఏమో మరి.........తరవాత నేను భయం లేదులే నాయనా అని చెప్పి బుజ్జగించి, జోల పాడి నిద్ర పోగొడుతున్నాను. దాసి కన బడిందా?

శశాంక – కనబడింది......కాని.......ఎప్పుడూ లేనిది. శంఖధ్వనులు వింటే ఇంత భయం ఎందు చేతనో?

సర్వ – రేపు ఆచార్యస్వామి దర్శనానికి వెళ్లి నప్పుడు ఈ విషయం విన్నవించండి. అన్నట్టు ఈవేళ వారి దర్శన మయిందా?

శశాంక – ......అయింది.

సర్వ – మన దీక్ష మాట ఏమన్నారు?

శశాంక – నీ అంతట నీవే వచ్చి వారిని ప్రార్థిస్తేనే గాని మన దీక్షా స్వీకరణం వల్లపడ దన్నారు మనము ఇద్దరమూ, ఈవిషయం దృఢంగా నిశ్చయం చేసుకుంటేనే గాని అది ఎంతమాత్రమూ తలపెట్టనే వద్దన్నారు.

సర్వ – వానిశ్చయంకూడా వారికి విన్నవించారా?

శశాంక – ఆఁ. నీమాటగా, నీ నిశ్చయంగా కూడా వారికి విన్నవించాను.

సర్వ – విని ఏమన్నారు?

శశాంక – నీ మనోధైర్యంలో వారికి కొంత అను మానం ఉన్నట్టుగా సెలవిచ్చారు.

సర్వ – నా ధైర్యంలోనా?

శశాంక – అవును. నీ ధైర్యంలో నే.

సర్వ – నేను ఒకసారి వారి దర్శనం చేసినప్పుడు నా నిశ్చయం కూడా కొంత సూచించానే.

శశాంక – కాదు సర్వమంగళా! ఈ దివ్య సత్యం అన్వేషించే దంపతులు తమ సర్వస్వమూ మహా నటరాజేశ్వరునికి పూర్ణాహుతిగా సమర్పించ డానికి సంసిద్ధులైతేనే గాని, దీక్షాస్వీకరణం ఎంతమాత్రమూ వల్లపడ దన్నారు.

సర్వ – సర్వస్వమూ పూర్ణాహుతిగా సమర్పించడం అంటే?

శశాంక – అంటే – మన సమస్త ధన కనక వస్తు వాహనాలూ, మన భవనమూ, మన సర్వస్వమూ విడిచి వెయ్యడానికి సిద్ధంగా ఉండాలన్నమాట! చివరికి మనకు ఎంతప్రియమైన వస్తువునైనా పరిత్యజించడానికి మనం సంసిద్ధులమై ఉండా లన్నారు ఆచార్యులు.

సర్వ – అయితే, మన దీక్షాస్వీకరణం లేదన్న మాటేనా?

శశాంక–ఇంకా నిశ్చయించలేదు. నా మనస్సులో నాకే కొంత ధైర్యం చాలనప్పుడు ఎల్లా నిశ్చయించను?

సర్వ – అయితే ఆచార్యులతో ఏమి సమాధానం చెప్పారు?

శశాంక – తిరిగీ ఒకసారి నీతో ఆలోచించి నా తుది

నిశ్చయం వారికి విన్నవిస్తానని అన్నాను. నీ అభిప్రాయం ఏమిటి?

సర్వ - భవిష్యత్తుమాట ఏమి కాదలచి ఉందో. మనం వెంటనే దీక్ష స్వీకరిస్తేనే మంచిది.

శశాంక - ఇది తేలికగా ఆలోచించవలసిన విషయం కాదు. నీవు నీలో బాగా విమర్శించుకో. ఇది అత్యంత కఠినమైన దీక్షాస్వీకరణం. అదేగాక మన మిద్దరిమీనూకూడా మిక్కిలి ధైర్యంతో ఆచరించవలసిన దీక్ష యిది. ఎవరు మధ్యలో మనో ధైర్యం విడచినా వ్రతభంగమే కాకుండా ఘోర పాతకం చుట్టుకుంటుంది. నీవు దృఢంగా ఆలోచించి నిశ్చయించుకో. తుదివరకూ నీవు ధైర్యంతో నిలబడగలవా?

సర్వ - .........పోనీ, సిరియాళునికి నెమ్మదిగా ఉండేటంతవరకూ మనం ఆగకూడదా? నాకు అబ్బాయి కలవరింతలు వింటే భయంగా ఉంది కూడాను!

శశాంక - నాకూ కొంత కాలం నిరీక్షించాలనే అనిపించింది. కాని ...... ఆలోచించగా - ఈ జన్మలో నాకు దీక్షార్హత లేదేమో నని పిస్తోంది. ఆచార్యస్వాములు చాలా వృద్ధులైనారు. వారికి కొంచెం దూరం నడవడానికైనా శక్తి చాలదు. ఏదో సందర్భంలో ఒకసారి వారు తిరిగీ మహాశివరాత్రివరకూ నేను జీవించనేమో అన్నారు. రాబోయే మహాశివరాత్రి దినమే ఈ మహాదీక్షకూ, పూర్ణాహుతికీ ఉచితమైన దినము. ఇది దాటిపోతే .....ఏమో... ......ఇంక భవిష్యత్తుమాట ఎవరు చెప్పగలరు.

సర్వ - ఆచార్యులు చిరంజీవులు. వారి విషయంలో అంత భయ మెందుకు?...పోనీ ముందు సంవత్సరం మహాశివరాత్రికి మనం దీక్ష స్వీకరించకూడదా? ఈ విషయం ఇప్పటికి ఆపివేయకూడదా?

శశాంక - వారు అలా అన్నప్పటినుండీ ఆయన ముందుసంవత్సరం వరకూ సిద్ధి పొందకుండా ఉంటారని నాకు నిశ్చయం కలగడం లేదు. ఏమో, ఈ జన్మలో మనకు దీక్షాస్వీకరణానికి అర్హత లేదేమో. ఎవరు చెప్పగలరు?

సర్వ - పోనీ ఆచార్యస్వామి ఆశ్రమానికి వెళ్ళి ఈ విషయాలన్నీ వారితో సంప్రతించవచ్చును. అంతవరకూ రెండుమూడు రోజులు ఆగకూడదా?

[సిరియాళుడు కలవరిస్తాడు-]

సిరియాళుడు ఎందుచేతనో కలవరిస్తున్నాడు. మీకున్నూ ధ్యానానికీ, శివపూజకూ కాలం అతిక్రమించింది. ఈ విషయం తరవాత ఆలోచించకూడదా?

శశాంక - పోనీ అల్లాగే చేదాము.

సర్వ - [పాడుతుంది]

౨ పాట

ఓ బాల నటరాజ! ఓ సుందరేశ్వరా! జో జో!
ఓ మహాలీలా రచిత ఖేలనా! ప్రభూ! జోజో!
నీ నీలినిద్దురను కొలని దెలికలువలై
నీమహానందలీలా కందుకమ్ములై
రజత గోళము లనవరతము లాస్యము సేయు
రజని వేళ లవి నిశ్శబ్దదానము సేయు
నా నయనముల వెలుగు నల్లనల్లని పాప! జోజో!
నా హృదయ హారేంద్ర నీలమాణిక్యమా! జోజో!
ఓ బాల నటరాజ! ఓ సుందరేశ్వరా! జోజో!
ఓ మహాలీలా రచిత ఖేలనా! ప్రభూ! జోజో!

[ తెర ]

౨

[శశాంకమౌళి ప్రాసాదం పైభాగంలో శయనాగారము. ప్రభాతవేళ. శశాంకమౌళి ఒకవైపునా సర్వమంగళ ఇంకో వైపునా నెమ్మదిగా నిద్రిస్తూ ఉంటారు. ఒక వైపున ఉయ్యాలలో సిరియాళుడు నిద్రపోతున్నాడు. దూరంగా హిమమిశ్రమైన అంధకారంలో ఆకాశంలో కార్తీక దీపం మినుకు మినుకుమని,

మిణుగురు పురుగులా, మెరుస్తూ ఉంటుంది. కీచురాళ్లు మంద్రంగా ధ్వనిచేస్తూ ఉంటాయి. సమీపంగా ఉన్న సరస్సులో కార్తీక దీపికల వరుసలు చిన్న చిన్న నోన్నెలలో తారకలవలె కదులుతూ ఉంటాయి. మంద్రంగా ఆ కీచురాళ్ళు ధ్వని చేస్తూ ఉండగా ఆ శృతిలో ఒక పాట మధురంగా వినబడుతూంది.

౩ పాట

ఓహో జీవన వన సహపథికా!
ఓయీ మానస విహంగమ సఖా!
దూరారుణగగనమ్మున నేవో!
తార విభాతాహ్వానము లవిగో!

బ్రతుకుమ్మరి యెర్రని చిప్పురులలో
మృదుల కులాయమె రచించితివాహో!
మరల మరల రెమ్మల గుబురులలో
పరువు విడుదు పుడుతల బుడుతలలో!

ఓహో జీవన వన సహపథికా!
ఓయీ మానస విహంగమ సఖా!
దూరారుణ గగనమ్మున నేవో!
తారవిభాతాహ్వానము లవిగో!

మెరయు మిణుంగురుబురువు వెలుగులో
మరి మరి మెరపుంగల గాంచెదవో!
అరుణోదయ సుందర పర్ణములే
మరచితివిగద మరేమున్నదిరే!

ఓహో జీవన వన సహపథికా!
ఓయీ మానస విహంగమ సఖా!
దూరారుణ గగనమ్మున నేవో!
తారవిభాతాహ్వానము లవిగో!

శశాంక – ఓహో, ఏమి దివ్యగానము. ఎవరా పిలుపు? ఏమిటీ విచిత్రము. నేను కలలో ఉన్నానా? మేలుకొని ఉన్నానా? ఆ గానం నా చెవి సోకినవెంటనే ఈ స్వప్నమేదో, మంచులా విడిపోతూ ఉంది. ఎంత చిత్రము, సర్వమంగళా......సర్వమంగళా...

సర్వ – ఆఁ ఆఁ ఏమిటి? ఎందుకు?

శశాంక – ఎంత చిత్రమైన కల! ఎంత మధుర గానము. ఇది స్వప్నంలో గానమా? ప్రపంచంలో గానమా? నేను నిజంగా మేలుకుని ఉన్నానా?

సర్వ – మీరు మేలుకునే ఉన్నారు. ఎవరో భిక్షుకులు తెల్లవారేవేళ భిక్షకోసం పాట పాడుకుంటున్నారు. ఆ పాటే మనకు మధురంగా వినబడుతూ ఉంది. అంత చిత్రంగా చెబుతున్నారు! మీకు వచ్చిన కల యేమిటి?

శశాంక – నేను ఎంత పవిత్రమైన స్వప్నం చూడగలిగాను, ఈ వేళ! ఏమి అదృష్టము?

సర్వ – ఆ కల కొంచెం నాకుకూడా చెప్పకూడదా?

శశాంక – అయితే విను మరి. అది అత్యంత మహోన్నతమైన గిరిశిఖరము. ఆ శిఖరం వైపు గోధుమవన్నె తామ్రము మోస్తునగా మెలికలు తిరుగుతూ వెళ్ళే ఒక దుర్గమమైన అరణ్యమార్గము. ఆ పర్వత శిఖరముపైన ఒక మహోజ్వల జ్యోతి వెలుగుతూ ఉంది. ఆ జ్యోతి వెలుతురులో ప్రసన్న గంభీరమూర్తి ఒక దివ్య పురుషుడు నన్ను పిలుస్తున్నాడు. నేను ఆశిఖరంవైపు వేగంగా నడిచి వెళుతున్నాను. నీవు నా అడుగుల్లో అడుగులు వేసి వెంటవెంటనే నన్ను అనుసరిస్తున్నావు. ఆదివ్యపురుషుడు మనల నిద్దరినీ ఉచ్చైస్స్వరంతో ఆహ్వానిస్తూన్నట్టుగా ఉన్నారు. ఆయన ముఖచిహ్నలవల్ల వారి భావం అవగతమౌతూ ఉంది గాని, వారి కంఠస్వరం ఏమాత్రమూ కూడా వినబడడం లేదు.

సర్వ – ఎంత చిత్రమైన కల– మనతో– మరి– సిరియాళుడుకూడా రావడం లేదా?

శశాంక – ఇదిగో......చెబుతున్నాను. సిరియాళుడు భవనంలో నిద్రపోతూ ఉండగా మరిచిపోయి మనం ప్రయాణమైనాము. చాలవరకూ మనం ఆ విషయమే మరిచిపోయి ప్రయాణం చేశాము.

సర్వ – చిత్రంగా ఉంది. మనం సిరియాళుణ్ణి మరిచి పోయి వెళ్ళడం అసంభవం కదా?

శశాంక – నేను చూసింది కలగదా! నా కథ సంపూర్ణంగా వినవా మరి?

సర్వ – ఔనౌను మరిచిపోయాను. తరువాత ఏమి జరిగింది?

శశాంక – తరవాత మన భవనంలో, హృదయ విదారకమైన సిరియాళుని ఆక్రందనం వినబడింది. మన దాసి సిరియాళుణ్ణి రక్షించండి, రక్షించండి అని ఏడుస్తూ పిలిచినట్టు వినబడింది.

సర్వ – అబ్బా, ఏమిటీ పీడకల! తరవాత!

శశాం – తరవాత అయ్యో సిరియాళుణ్ణిమరిచిపోయి మనం ప్రయాణమైనాము. అదుగో అ దూరంగా వినబడే ఏడుపు మన అబ్బాయిదే. అయ్యో, ఏమి జరిగిందో. నేను వెళ్ళితీసుకువస్తాను అంటూ నువ్వు మళ్ళ తిరిగి పరుగెత్తి వెళ్ళబోయావు.

సర్వ – ఇది వింటూంటే నాకు హృదయం క్రమంగా బరువై పోతోంది. అబ్బా, ఏమైంది ఆపైన?

శశాంక – ఆపైన పర్వతశిఖరంమీద ఉన్న దివ్య పురుషుడు మనకు చాలా సమీపంగా పరుగెత్తుకొని వచ్చి జలధరగంభీరస్వరంతో, సిరియాళుని కేమీభయంలేదు, తిరిగి వెళ్ళిపోకండి,రండి, రండి అని నిన్నూ నన్నూ మళ్లీ ఆహ్వానించారు. నేను వెంటనే నీ హస్తం అదిమి పట్టుకున్నాను. ఆపైన నీవు చెయ్యి విదిలించుకుంటూ, నా సిరియాళుడు, నా సిరియాళుడు, నేను వెళ్లాలి, నన్ను వదలండి అంటూ ఆక్రందనం చేశావు!

సర్వ – నే నింక మీ కథ వినలేను. నాకు భయంగా ఉంది! ఆగండి!

శశాంక – భయంలేదు. చివరకు కథ అంతా ఆనందాంతంగానే జరిగింది. ఆపైన నన్ను విడవండి, సిరియాళునికోసం నేను వెళ్ళాలి అంటూ నన్ను ప్రాధేయపడి ప్రార్థించావు.

సర్వ – నాకే గాని, సిరియాళుని ఏడ్పువింటే మీకేమీ మనసు కరగ నేలేదా? తరువాత మీరేమి చేశారు?

శశాంక – ఇదిగో, ఇంకా పూర్తికాలేదుగదా, చెబుతున్నాను విను మరి. ఆపైన నేను, అదుగో ఆ దివ్యపురుషులు మనతో భయంలేదని చెబుతున్నారు. ఆయన కటాక్షంవల్ల మన అబ్బాయి కేమీ ఆపద కలగదు. శిఖరంవైపు రా, భయం లేదు అని నిన్ను బలవంతంగా శిఖరంవైపు నడిపించుకొంటూ కొంతదూరం వెళ్ళాను.

సర్వ – సిరియాలుని సంగతి చూడకుండానే వెళ్ళారా మరి? ఎంత నిర్దయ మీకు? ఆ పైన?

శశాంక – దివ్యపురుషుడు మనకు భయం లేదు అన్న పిమ్మట ఇంక భయ మెందుకూ' ఆపైన నీవు, నా సిరియాలుని విడిచి నేను రాను. నాకు శిఖరం వద్దు. దివ్యజ్యోతి వద్దు. నన్ను వెళ్ళనివ్వండి. సిరియాలుని చూచి వెంటనే తిరిగి వస్తాను. విడవండి విడవండి అని అంటూనే ఆ దుర్గమారణ్యమార్గంలో మూర్ఛపోయావు. నిన్ను నేను భుజాలతో ధరించి ఆ శిఖరంవైపు ప్రయాణమై వెళ్ళాను.

సర్వ – ఎంత భయంకరమైన స్వప్నము. మనకే ఆపద రాదలచి ఉందో కదా!

శశాంక – భయములేదు. నేను నిన్ను ఆ దివ్యపురుషుని సన్నిధిని దింపి శీతలోపచారాలు చేశాను. నీకు స్పృహ వచ్చిన తరువాత దీనంగా విలపిస్తూ, ఆదివ్య పురుషునివైపు చూస్తూ "నా సిరియాళుని చూడనివ్వండి ...... నన్ను కరుణించండి" అని ప్రార్థించావు.

సర్వ – ఆ మాటలు విని ఆ దివ్యపురుషులు ఏమన్నారు?

శశాంక – ఆయన నీవైపు సస్మితగంభీరంగా చూచి ఆ జ్యోతివైపు చూడు......అదుగో, నీసిరియాళుడు ఆ వెలుగులో ఆడుకుంటున్నాడు అన్నారు.

సర్వ — మళ్ళీ నా తండ్రి నాకు కనబడ్డాడుగదా:— చివరికి? అబ్బా!

శశాంక — అప్పుడే కల సంపూర్ణం కాలేదు...... విను మరి. తరువాత ఆ పెద్ద వెలుతురులో ఘల్లు ఘల్లుమంటూన్న గజ్జెలతో ఆడుకొంటూన్న సిరియాళుడు నిన్ను చూచి పరుగెత్తుకొనివచ్చి నీ ఒడిలో కూర్చున్నాడు. అప్పటికి — చివరికి, నీ విచారం మహానందంగా పరిణమించింది. తరువాత మన మిద్దరమూకూడా ఆ మహాపురుషునికి నమస్కరించాము. ఆయన ప్రసన్నముఖంతో ఇద్దరిని ఆశీర్వదించి మీ రింక ధన్యులు అన్నారు. తరువాత మనం అందరమూ చిత్రంగా ఆ జ్యోతిలో లీనమైపోయాము.

సర్వ — ఎంత చిత్రంగానూ భయంకరంగానూ ఉంది ఈకల! చివరికి ఆనందాంతంగా పరిణమించినా, ఇది వింటే నా హృదయం భారంగా వుంది. ఏమి కొదలచి ఉందో కదా.

శశాంక — నీకు అట్లాంటి భయము ఏమీ లేదు. ఇది మంగళాంతమైన కల. ప్రభాత వేళలో రావడం వల్ల అచిరకాలంలో మనకు గొప్ప మేలు చేకూరుతుందని అనుకోవలసి ఉంది. పైగా మనకి ఆ మహాపురుషుని కరుణాబలంగూడా ఉన్నట్టు కనబడుతూ ఉందిగదా!

సర్వ—అయినా, పురోహితులవల్ల ఈ స్వప్నఫలితం మనం తెలుసుకోవాలి. తమరు దీక్షమాట తల పెట్టినప్పటినుంచీ నాకు కొంచెం బెంగగానే ఉంది. కాని ఇది ఈ కారణంవల్ల అని వివరించి చెప్పలేకుండా ఉన్నాను. పోనీ... ఈ సారికి ఈదీక్ష మానివేయకూడదా?

శశాంక — కాదు కాదు. నీ కేమీభయంలేదు. చివరకు ఈ స్వప్నంవల్ల మనకు శుభఫలమే కలుగుతుంది. నాకు మాత్రం ఇది వింటే పూర్వంకంటె ధైర్యమే కలుగుతూ ఉంది. ఇది మనకు మంచి శుభశకునము. నేను ఈ శివరాత్రికే దీక్ష స్వీకరిస్తాను. ఈ శివరాత్రికి నేను దీక్ష స్వీకరించకపోతే నాకిఅక మరి ఈ జన్మకి లేనట్టే!

సర్వ — ఏమో మరి! అప్పైన మీ యిష్టము! నాకు మాత్రం అకల తలుచుకుంటే భయంగా నే ఉంది.

శశాంక — ఇంత చెప్పినా, నామీద నీకు అపనమ్మకమేనా? నాకు మాత్రము సిరియాళుని మీద ప్రేమలేదా?

సర్వ — నేనుమాత్రం మీ మాటకి అడ్డు చెబుతున్నానా? మీ యిష్టము అన్నానుగదా!

శశాంక — కాని......నీలో ... ఏమోగాని అంత ఉత్సాహం కనబడడంలేదు. ఆచార్యులతో ఇల్లా మాట్లాడితే వారు దీక్ష ఇస్తారా మరి?

[దూరాన్నుంచి 'ఓయీ మానస విహంగమ సఖా' అని పాట వినబడుతుంది]

ఓహో విను! విను! అదుగో మళ్ళీ ఆ పాట వినబడుతూంది! ఆ పాట వింటే మళ్ళీ నా హృదయం తరంగమై ఉప్పొంగుతూ ఉంది. ఎంత మధురగానము!. ఇది కూడా మనకు ఒక శుభశకునమే సుమా! ఏమి ఆలోచిస్తున్నావు. ఇంకా నీకు సందేహనివృత్తి కాలేదా?

సర్వ — ఎంతమాట! నేనూ స్థిరమైన నిశ్చితాభిప్రాయంతోనే చెబుతున్నాను. నాకు అధైర్యం తొలగిపోయింది. నామాట విశ్వసించండి!

శశాంక — నిజంగానే అంటున్నావా, సర్వమంగళా!

సర్వ — నేను దృఢనిశ్చయంతో చెబుతున్నాను. మీరు విశ్వసించకపోతే ఏమి చెయ్యగలను మరి!

శశాంక — నిజంగా నేను ధన్యుణ్ణి, సర్వమంగళా, యీవేళ.

[ఇద్దరూ పాట వింటూ ఉంటారు — పాట నెమ్మదిగా అంధకారంలో లీనమై పోతుంది]

## 3

[ఆచార్యుని ఆశ్రమము, సాంద్రమైన వృక్షచ్ఛాయలో ఒక వేదికపై ఉన్న వ్యాఘ్రాసనం పైన ఆచార్యుడు ఉపవిష్టుడై ఉంటాడు. వేది

కకు సమీపంలో ఆచార్యుని పాదాలదగ్గర, సర్వమంగళా, శశాంకమౌళీ, నేలమీద కూర్చుని ఉంటారు. అప్పుడే కొంచెము మధ్యాహ్న సమయం దాటింది. ఉండి ఉండి విసిరే పిల్లగాలికి పచ్చని పండుటాకులు రాలుతూ ఉంటాయి. సమీప సరోవరంలో నిద్రిస్తూ ఉన్న హంసలూ, తామరపువ్వులూ, ఆ గాలికి అటూ ఇటూ కదులుతూ ఉంటాయి. ఆ కదలికలకు చిన్నచిన్న మీనులు నీళ్లలో తళుక్కుమని మెరుస్తూ ఉంటాయి. అక్కడక్కడ ఆకులచాటునుండి తెల్లని సూర్య కాంతులు పుష్పాల్లా పడి మెదులుతూ ఉంటాయి. జననీజనను లిద్దరూ ఆచార్యుని మాటలు గంభీర ముఖాలతో వింటూంటారు.]

ఆచార్య – నాయనా, శశాంకమౌళీ, అమ్మా సర్వ మంగళా, ఇదిగో ఈవైపున కొమ్మల్లో తళతళ మెరుస్తూ ఉన్న బంగారు పిచ్చుకల గూళ్ళు కొంచెం జాగ్రత్తగా పరిశీలించండి!

సర్వ – చిత్తము.........దర్శించాము.

శశాంక–అవునౌను. ఆఁ...అదిగో కనబడుతూంది. చూశాను.

ఆచార్య – ఆ పక్షులు ఏమి చేస్తున్నారో కొంచెం గమనించారా!

శశాంక – కొంచెం దూరం ఎగిరివెళ్ళి ఆహారం సంపాదించుకుని తిరిగి గూళ్ళు చేరుకుంటున్నాయి.

ఆచార్య – అంతేకదా!

సర్వ – ఔను! అంతే!

ఆచార్య – ఆఁ అదే పరిశీలించవలసిన విషయం. చూడండి. ఆ పక్షులు ఆకాశంలో కొంతదూరం వరకే ఎగిరి పోగలవు. ఆ మహోన్నత నీలాకాశంలో అపారదూరంలో ఉన్న సూర్యునివైపు అవి తేరిపార చూడనైనా చూడలేవు.

సర్వ – అవును ప్రభూ!

ఆచార్య–ఆవిధంగా మానవు లందరూకూడా, సామాన్యంగా ఆ విహంగాల వంటివారు. మానవులు నివసించడానికి కూడా ఏవో చిన్నచిన్న కులాయము లుండాలి. వారు ఆకాశంలోనికి ఎప్పుడైనా కొంతదూరం ఎగిరినా తిరిగి ఆ గూళ్ళు చేరుకుంటూ ఉంటారు. మహోన్నతమైన సూర్యలోకం చేరవలెనని కాంక్షించడమే మానవుల్లో అరుదుగా ఉంటుంది!

శశాంక – అయితే మానవులందరూ భాస్కరలోకం చేరలేమని నిరాశ చెంది ఊరుకోవలసిందేనా? వారికి సంపూర్ణసత్యాన్వేషణసమర్థత లేదా?

ఆచార్య–లేకేమి! తప్పకుండా మానవు లందరికీ ఆ అర్హత ఉంది. కాని, ఒక్క సంపాతి తప్ప ఎవరైనా సూర్యలోకం చేరడానికి ప్రయత్నించిన వారున్నారా?

సర్వ – లేరన్న మాట నిజమే.

ఆచార్య – ఆ సంపాతి కూడా, సూర్యమండల సమీపంలోనే తనరెక్కలు భస్మీభూతమై, నేలరాలి పోయిన విషయం మీరు ఎరుగుదురు కదా?

శశాంక – అవును, కావచ్చును. తమరు సెలవిచ్చే విషయ మేమిటి?

ఆచార్య – ఆ విధంగానే మానవులలోకూడా అనేకులు జాజ్వల్యమానమైన ఆ నగ్నసత్యం యొక్క స్వరూపం సందర్శించలేరు. వారు అటువైపు దృష్టి ప్రసరించేసరికి, తత్‌క్షణమే వారి దృష్టి అంధీభూతమై పోతుంది. కాబట్టి సహస్ర లక్షలమానవులలో, ఎవరైనా ఒకరికి మాత్రమే, ఆ నగ్నసత్యాన్ని సందర్శించే అధికారం శాస్త్రకారులు ప్రసాదించారు. ఇంక మిగిలిన మానవు లందరూ, ఒక విస్ఫులింగములో భాస్కరుని భావించుకుంటూ సాధన చెయ్యవలసి ఉంటుంది. వారికి ఆ తీక్ష్ణసత్యం సందర్శించే అధికారం లేదు.

శశాంక – అయితే మాకీ జన్మలో ఆ సంపూర్ణ దీక్ష స్వీకరించే యోగ్యత లేనేలేదా?

ఆచార్య – లేకేమి? ఉన్నది. ఈ క్షణంలోనే ఆ

మహాదీక్ష స్వీకరించవచ్చును. కాని ఆ దీక్ష తీసుకునేవారికి హిమాలయస్థిరమైన ధైర్యం ఉండాలి. అచంచలమైన దీక్ష కావాలి. అటువంటి దీక్ష మీరు తీసుకోగలరా?

శశాంక - నేను తమ యెదుట పరమేశ్వర సాక్షిగా ప్రమాణం చేసి మనవి చేస్తున్నాను. తమ రెటువంటి అగ్నిపరీక్ష చేసినా ఆపరీక్షకు నిలబడి దీక్ష స్వీకరిస్తాను?

ఆచార్య - ఇది సామాన్యమైన దీక్షకాదు. ప్రళయాగ్ని పరీక్ష. నీవు పాషాణ స్థిరమైన ధైర్యంతోనూ, విశ్వాసంతోనూ, నిలబడగలవా!

శశాంక - తమ నిర్వ్యాజకరుణ ఉంటే ఎటువంటి వజ్రప్రహారమైనా భరించగలను...... ............ఆచార్య పాదాలు స్పృశించి ప్రమాణం చేస్తున్నాను. నేను ఎంత కఠిన పరీక్షకైనా నిలబడగలను.

ఆచార్య - నిస్సందేహంగా చెబుతున్నావా, ఈ మాట?

శశాంక - ఆ. నిస్సందేహంగా చెబుతున్నాను.

ఆచార్య - ఇది స్థిరమేనా?

శశాంక - స్థిరమే.

ఆచార్య - ............సరే. నీలో నాకు కొంత విశ్వాసం కలుగుతూ ఉంది. సరే కాని, మీ దంపతు లిద్దరూ స్వీకరించవలసిన దీక్షగదా యిది? సర్వమంగళ యీ మహాగ్ని పరీక్షకు తాళగలదా మరి?

శశాంక - ఆ. ఆమె నా అంత మహాధైర్యంతోనూ ఈ దీక్ష స్వీకరించి నిలబడగలదు.

ఆచార్య - అది నీవు చెప్పవలసిన సమాధానంకాదు సర్వమంగళ ముఖతః ఆమాట రావాలి. ఏమమ్మా, ఏమిటి నీ అభిప్రాయం?

సర్వ- విన్నవిస్తున్నాను. నేనున్నూ ఆదీక్ష గ్రహించడానికే తమ సన్నిధికి వచ్చాను. తమ కరుణ వల్ల నేనుగూడా ఎటువంటి కఠినపరీక్షకైనా తాళుకోగలను

ఆచార్య - (చిరునవ్వుతో) - అమ్మా ఇటుచూడు. కొంచెం నామాట విను. నీకీ వీరశైవుల అసిధారావ్రతాల విషయం కొంచెమూ తెలియదు. చూడు, ఇంకా కొంతకాలం నేను ఉపదేశించిన విధంగా సిరియాళ కుమారుని పరమశివునిగా భావించి ఆరాధిస్తూ ఉండు. నేను ఇంతకు పూర్వం ఉపదేశించిన విధంగా ఆరాధనలూ,అవీ ఆచరిస్తూ ఉండు. కొంత హృదయ పరిణామం కలిగేవరకూ గూడ ఈ మహాదీక్ష విషయం మీరు తలపెట్టనేవద్దు. ఇది చిరకాలానుభవంతో చెబుతూన్నమాటలు. నా మాట వినండి, తొందరపడకండి.

శశాంక - మేము కేవలమూ, దీక్ష స్వీకరించడం కోసము, ఇంతదూరమూ, శ్రమపడి తమ పాద సన్నిధికి వచ్చాముకదా. తమరు ఇలా ఆశాభంగము చెయ్యడం న్యాయమేనా? తమకు మా ధైర్యంమీద విశ్వాసం కలగదా? మరి యింక?

సర్వ - గురుదేవులు మామీద కరుణించరన్నమాటేనా మరి?

ఆచార్య - అమ్మా, సర్వమంగళా! నీవీ అసిధారా వ్రతం అవలంబించలేవు సుమా! నేను చిరకాలానుభవంతో చెబుతున్నాను.

సర్వ - తమకు ఎందుచేతనో నామీద విశ్వాసం కలగడమే లేదు. తమకు నే నేవిధంగా మనవి చేసి ఒప్పించగలను?

ఆచార్య - ఇదిగో జాగ్రత్తగా వినండి. నేను తిరిగి తిరిగి ఆవిషయమై వివరిస్తున్నాను. సామాన్యమానవులు తమ కాంక్షలతోనూ, తమకు ఇంతకు పూర్వం పరిచితమైన ప్రాపంచిక దృష్టితోనూ మాత్రమే ఆ మహోజ్జ్వల సత్యాన్ని గ్రహించవలెనని ప్రయత్నిస్తూ ఉంటారు. అటువంటి ప్రయత్నము ఎన్నటికీ ఫలవంతము కానే కాదు. అటువంటి ప్రయత్నము చేసినప్పటికీ అది

ఆచార్యునికీ, శిష్యునికీ అరిష్టకారణం అవుతుంది............ఒక్క విషయం వినండి. నేను తీవ్రంగా పరీక్షిస్తున్నాను. కొంత లేశం గాని, మోహపరమాణువుగాని, హృదయంలో నిలిచి ఉన్న మానవులు - ఈ మహోజ్జ్వల సత్యంవైపు కళ్ళు తెరిచి చూడనైనా చూడలేరు. సత్య స్వరూపం సత్యదృష్టితో చూడ గలిగినవారే ఈ మహాదీక్షకు అర్హులు. మిగిలిన వారు ఆవిషయం స్మరించడానికైనా అనర్హులు.

సర్వ - గురుదేవులు మామీద కొంచెము కరుణిస్తే.............

ఆచార్య - ఈ మహాదీక్షలో ఆచార్యకృప కేవలమూ నిమిత్తమాత్రమే. సాధకుని అకుంఠిత విశ్వాసమూ, దీక్షా మాత్రమే ఫలసిద్ధిలో సహాయకారులు.

శశాంక - / సర్వ - } [వినయంగా [illegible]] - మేమిద్దరమూ తమరు విధించిన కఠిన నియమాలన్నీ నిర్విఘ్నంగా నెరవేర్చగలము. మాకు దీక్షాప్రసాదం దయ చేయించండి.

ఆచార్య - సరే. మీకు దీక్ష ఇవ్వవలెనని అనుకుంటున్నాను. కాని ఒక ప్రశ్న. మీరు మీ సమస్తమూ తృణప్రాయంగా పరిత్యజించవలసి వస్తే అలా పరిత్యజించడానికి సిద్ధంగా ఉన్నారా?

సర్వ - ఉన్నాము.

శశాంక - నేను ఈ క్షణంలోనే నా సర్వస్వమూ ఆచార్యుల పాదసన్నిధిని విడిచిపెడుతున్నాను.

సర్వ - మీ కరుణాకటాక్షం ఉంటే తమరు ఏమి అడిగినా నేనున్నూ పరిత్యజించగలను.

ఆచార్య - ఆగండి. సర్వమంగళా! నేను కేవలం నిన్నే ప్రశ్నిస్తున్నాను. నీవు నీ భర్తనూ పుత్రిణ్ణీ విడిచి సన్యాసినివై అరణ్యవాసం చెయ్యగలవా?

సర్వ - తమకు నామీద ఎంత అవిశ్వాసము? నేను నిర్భయంగానూ, మహానందంతోనూ ఆవిధంగా నివసించగలను.

ఆచార్య - సరే. మరి ఒక పరీక్ష. నీచేతిఖడ్గంతో నీపతి శిరస్సు ఖండించి, అవసరమైతే, అగ్నిజ్వాలలో హోమం చెయ్యగలవా?

సర్వ - అబ్బా, ఎంతమాట ..................

[[illegible] భర్తవైపు చూస్తుంది]

శశాంక - సర్వమంగళా.........ఎందుకోసం అల్లా నావైపు చూస్తున్నావు? నీకు గురుదేవులమీద యింకా అవిశ్వాసమేనా? వారు మన కుటుంబం తరింపజేయడానికి అవతరించిన మహేశ్వరావతారం గదా! ఎంత వెర్రిదానవు నీవు?

సర్వ - [ఆలోచిస్తూ ఉంటుంది]

శశాంక - ఏమి సర్వమంగళా, మాట్లాడవు. నేను నీకు బోధించినదంతా ఏమై పోయింది. నీదృఢ విశ్వాసం ఇప్పు డెక్కడికి పోయింది. మన స్వప్నం ఇంతలోనే మరిచిపోయావా? చివరకు మనకు శుభఫలితమే కలుగుతుందనీ, దీక్ష గ్రహించవచ్చుననీ పురోహితులు అన్నారుగదా? ఆమాట మరిచిపోయావా? ఎంత ధైర్యహీనురాలవు! ఇంక నీకు ఏమని చెప్పగలను?

సర్వ - గురుదేవులు నాసంశయం మన్నించగలందుకు వేడుకొంటున్నాను... క్షమించండి. నేను తమరు ఆజ్ఞాపించిన విధంగా నిస్సందేహంగా నెరవేరుస్తానని ప్రమాణం చేస్తున్నాను.

ఆచార్య - ఈ మహాగ్ని పరీక్షలో సంశయము ఎంతమాత్రమూ పనికిరాదు. నేను తిరిగి జ్ఞాపకం చేస్తున్నాను. అవసరమైతే ఇంతకంటె మహాఘోరమైనదీ కఠినమైనదీ అయిన పరీక్షకు మీరు సిద్ధంగా ఉండవలసి ఉంటుంది. నేను ముందుగానే చెబుతున్నాను.

సర్వ - [కన్నీళ్ళతో] - ఆచార్యదేవులకు నేను ఎంత నిశ్చయంతో మనవిచేసినా విశ్వాసంలేదు గదా! తమకు మామీదకలిగిన కరుణ ఇంతలోనే నశించి

పోయిందా? తమరు ఇంతగా పరీక్షించవలెనా? మా హృదయాలూ, మా ఆశలూ, మా కాంక్షలూ తమకు మాత్రం తెలియవా? ఇంతకంటె తమకు మేము ఏమని విన్నవించగలము!

ఆచార్య - నేను మాటిమాటికీ, ఈ విషయాలన్నీ కారణం లేకుండా చెప్పడం లేదు. ఈ మహాదీక్ష, కేవలమూ నిజమైన ధైర్యం కలిగిన సాధకులే ఆచరించగలరు. అందుచేత నేను మిమ్మల్ని ఇంత కఠినపరీక్ష చేయవలసివచ్చింది... .........భయం లేదు. పరమశివ కటాక్షం మీమీద ప్రసరిస్తూ ఉంది. మీకు ఫలసిద్ధి కలగగలదని ధైర్యం కలిగింది. ఇక మీరు వెళ్లవచ్చును.

ఇద్దరూ - మేమిద్దరమూ ఆచార్య పాదరేణువులు శిరసావహించి సెలవుతీసుకుంటున్నాము. మేము ధన్యులము, గురుకటాక్షమే శరణము. ఇప్పుడే దీక్ష అనుగ్రహించండి మాకు.

ఆచార్య - బ్రహ్మాకృపాహి కేవలమ్. భయం లేదు. మీకు నిర్విఘ్నంగా ఫలసిద్ధి కలుగుతుంది. కాని దినదినమూ మహామంత్రజపమూ, ఉపవాస దీక్షలూ, ఏమరకుండా ఆచరిస్తూ ఉండండి. సాధకుని ప్రయత్నం ఏమాత్రం లోపించినా, పరమేశ్వర కరుణాప్రసారం కలగదు. మిక్కిలి జాగ్రత్తగా ఉండవలసి ఉంటుంది. ఇప్పుడే దీక్ష ఇస్తున్నాను.

ఇద్దరు - మహాప్రసాదము. గుర్వాజ్ఞ శిరసావహిస్తున్నాము.

ఆచార్య - మీరు సంధ్యవేళ కాగానే ఈ మహాదీక్ష స్వీకరించవచ్చును. సమీపంలోనే మహాశివరాత్రి. ఆనాడు సంపూర్ణాహుతి చేయవలసి ఉంది. ఆనాడు నేను మీ భవనానికే వస్తున్నాను.

ఇద్దరూ - చిత్తం, మహాప్రసాదము. ధన్యులము.

## ౪

[శశాంకమౌళి భవన ప్రాంగణము. ఆ ప్రాంగణంలో ఉన్న వకుళాలూ, చంపకాలూ, మందారాలూ, లేత లేత నీరెండలో నీడల రూపంగా కరిగి పశ్చిమంగా ప్రవహిస్తూ ఉన్నట్టు కనబడతాయి. ఇంకా, ఆ ప్రాంగణంలో పంచకోణాకారాలైన పంచరంగుల రంగవల్లులు ఎర్రని ఎండలో వింతవింత రంగులతో మెరుస్తూ ఉన్నాయి. సమీపంలో ప్రాతఃకాలభిక్షకోసం బయలుదేరిన జంగమదేవరల ఓంకారమయములైన శంఖ ధ్వనులూ, ఘంటాస్వనాలూ, గంభీర నిశ్శబ్దతలో మెల్లగా లీనమౌతున్నాయి. ఒక పాటపాడుతూ ఒక భిక్షుక బాలకుడు ప్రవేశిస్తాడు. అతని పాట ఆ పరిసర సౌందర్యానికి చైతన్యం కలిగిస్తుంది.]

ఆ పాట

ఎన్ని తీర్థములాడి, యెన్నినోములు నోచి
కన్నావొ తల్లి యీ చిన్నారి కృష్ణుణ్ణి
ఊరుకుందామన్న ఊరుకోనీదమ్మ
ఊహాకందని చేతలో యశోదమ్మా!

చిన్నికలకలనవ్వు విన్నవారిది సొమ్ము!
కన్నులకు వెలుగైన వెన్నదొరుడుసుమ్మా!
తనుగనిన యంతలోననె మాయమౌనమ్మ!
వెనువెంట దరుమవచ్చిన దొరకడోయమ్మ!

ఎన్ని తీర్థములాడి, యెన్నినోములు నోచి
కన్నావొ తల్లి యీ చిన్నారి కృష్ణుణ్ణి
ఊరుకుందామన్న ఊరుకోనీదమ్మ!
ఊహాకందని చేతలో యశోదమ్మా!

అమ్మా...........బిచ్చం పెట్టు తల్లీ.

సర్వ-[కిటికీలోనుని ఎత్తుకుని ప్రవేశిస్తుంది] ఎవరు నాయనా నువ్వు? ఎంత బాగా పాడుతున్నాడు ఆ చిన్న పిల్లాడు. మణికర్ణికా! ........... భిక్షం త్వరగా తీసుకురా! ఏది నాయనా, మళ్లీ

కొంచెం పాడు వింటాను. ఇంత చిన్నవాడి
వైనా ఎంత ముద్దుగా పాడుతున్నావు!

క - ఏమిటి తల్లీ సెలవు?

సర్వ - నీవు పాడే పాట పూర్తిగా పాడు నాయనా! కొంచెము వింటాను.

భిక్షుక -

పాట

బాలకుల కందరకు పాలుపెరుగులు పంచు
చాలి నన్నీ త్రాగి పాలకడవ పగుల్చు
మనసులో కోపించి మాట చెబుదామంటె!
కనుల గనినంత నెమ్మనము కరిగినదామె!

ఎన్నినోములునోచి యెన్ని తీర్థములాడి,
కన్నావో తల్లి యీ చిన్నారి కృష్ణున్
ఊరుకుందామన్న ఊరుకోనీదమ్మ!
ఊహాకందని చేతలో యశోదమ్మా!

పొరుగింటి భామ లందరము పరుగిడివచ్చి
తడుముకొని రాగ తొందరగ నీయెది జేరె
తరతరద్దష్టఫలం గలిగినా మాయమ్మ
తనివార ఏని ముద్దాడనీ వమ్మా!

సర్వ - ఎంత తియ్యగా పాడుతున్నావు, బాబూ నువ్వు..............మీ అమ్మ ఎక్కడుంది నాయనా? - [దాసి భిక్షం తెస్తుంది] - అదుగో ఆ బియ్యం పట్టు నాయనా!

భిక్షుక - [భిక్షం తీసుకుని] - మా అమ్మ చిన్నప్పుడే పోయిందమ్మా.

సర్వ - అయ్యో పాపం............. పోనీ మీ నాన్న ఉన్నాడా?

భిక్షుక - ఎవ్వరూ లేరు తల్లీ!

సర్వ - మరి నీకు సంరక్షణ? నిన్ను ఎవరు పెంచుతున్నారు నాయనా?

భిక్షుక - నన్ను మా తాతయ్య పెంచుతున్నాడమ్మా! మేము ముష్టివాళ్ళముగదా! మాకు సంరక్షణ ఏమిటి తల్లీ!

సర్వ - మీ యిల్లెక్కడ నాయనా?

భిక్షుక - ఊరికి అవతల మర్రిచెట్టుకింద తల్లీ.

సర్వ - మీ తాత ముష్టికి రాకుండా నువ్వు వచ్చావేమి మరి?

భిక్షుక - మా తాతయ్య ముసలివాడైపోయాడు. ఎక్కడికీ కదలలేడు. ఊరికే చెట్టుకింద పడుకుని ఉంటాడమ్మా!

సర్వ - మరి నువ్వేనా ఆతనికి సంరక్షణ?

భిక్షుక - చిత్తం తల్లీ......కప్పుకోడానికి ఏదైనా ఒక దుప్పటీగుడ్డ ఇప్పించండి తల్లీ. చలేస్తోంది తల్లీ.........

సర్వ - మణికర్ణికా!......ఇదుగో......లోపలికి వెళ్ళి ఒక మంచి దుప్పటీ తీసుకురా పాపం.

దాసి - చిత్తం అమ్మా, తీసుకొస్తాను.

సర్వ - మీ అమ్మ ఎప్పుడు పోయింది నాయనా?

భిక్షుక - ఏమోనమ్మా.

సర్వ - మీ నాయన!

భిక్షుక - ఒక యేడాదికి పైగా అయిందమ్మా!

సర్వ - అయ్యో పాపం. ఇదిగో ఆ దాసి తెచ్చిన దుప్పటీ పుచ్చుకో నాయనా. ఎప్పుడైనా అన్నం లేకపోతే మా యింటికి వస్తూండు. పా వెక్కడుంది వెళ్లు పాపం. [భిక్షుకబాలుడు [illegible] పోతాడు. [illegible]]

దాసి - ఏమమ్మా, తమరు నిన్నటినుంచీ అల్లా దిగులుగా ఉన్నారు? ఇందాకటినుంచీ మీ కళ్ళమ్మట కన్నీళ్ళు రాలుతూనే ఉన్నాయమ్మా. ఎందుకమ్మా అల్లా దిగులుపడతారు?

సర్వ - ఏమి చెప్పను దాసీ. నాఅంత దురదృష్టవంతురాలు ఈ ప్రపంచంలో ఎవ్వరూ ఉండరు. ఏమి చెయ్యను?

దాసి - అదేమమ్మా? అల్లా అంటున్నారు?

సర్వ - మేము కొంత కాలానికి పూర్వము శైవాచార్యుల అభిమానిక శిష్యులం ఎరుగుదువా నువ్వు?

దాసి- ఆ ఏమిటుదునమ్మా! పట్టణమంతా మీ రేదో దీక్ష పుచ్చుకున్నారని విస్తారంగా చెప్పుకున్నారమ్మా. అప్పుడేనా?

సర్వ - అవునప్పుడే. అప్పుడూ.........అయ్యగారూ నేను ఒక ఘోరదీక్ష పుచ్చుకున్నాము కాదూ? ఆ విషయం తలుచుకుంటే ఇప్పుడు నాకు బెంగగా ఉంది. అంతే.

దాసి - ఏమమ్మా, అల్లా అంటున్నారు? మీకు ఇష్టంలేదా మరి ఆ దీక్ష?

సర్వ - ఎందుకని అట్లా అడుగుతున్నావు?

దాసి - ఏమీ లేదమ్మా. పట్టణంలో జనం అంతా యోగీశ్వరులు కూడా పుచ్చుకోలేని దీక్ష మీరు పుచ్చుకున్నారని ఆశ్చర్యపడుతున్నారమ్మా. మరి మీరు చూస్తే ఇల్లా బెంగపడుతున్నారు. ఇదంతా నాకు వింతగా ఉంది.

సర్వ - ఔను దాసీ, నేను నా అంతట దీక్షకోసం ధైర్యంగా ఆశ్రమానికి వెళ్ళినమాట నిజమే. అయితే ఆచార్యుల మాటలవల్ల కొంచెము భయం కలిగింది. కాని, చివరకి అయ్యగారి మాటలవల్లనైతే నేమి, ఆచార్యుల మాటలవల్లనైతే నేమి, ఆ సమయానికి నాకు కొండంత ధైర్యం కలిగినట్లయింది. ఆ సమయంలో నేను, ఆ కఠినదీక్ష అయ్యగారితో కూడా తీసుకున్నాను.

దాసి - అయితే మరి జరిగిన దానికి ఇంత బెంగ యెందుకు తల్లీ!

సర్వ - అది కాదు దాసీ......ఆ సమయాన్ని ఆచార్యులు అన్న మాటలు తలుచుకుంటే నాకు భయంగా ఉంది. గుండెల్లో సముద్రం పొంగుతూన్నట్టుంది.

దాసి - ఎందుకమ్మా అంత భయం? వారేమన్నారు?

సర్వ - చూడు దాసీ, ఆ దీక్ష స్వీకరించినవారు, తమ సమస్తమూ విడవడానికి సిద్ధంగా ఉండవలెనన్నారు.

దాసి - అంటే ఏమిటమ్మా?

సర్వ - అంటేనా......అవసరమైతే నేను అయ్యగారి శిరస్సుకూడా ఖండించి హోమం చెయ్యడానికి సిద్ధంగా ఉండాలన్నమాట. నేను ఆ మాటలు అనలేనుగాని - మరి యే కఠిన పరీక్షకైనా సిద్ధంగా ఉండా లన్నారు.

దాసి - శివ శివా. అదేమిటమ్మా అలాంటిమాటలు అంటారు?

సర్వ - ఔను దాసీ, అవే ఆచార్యులు అన్న అక్షరాలు.

దాసి - అయ్యో ఇదెక్కడి వ్రతం తల్లీ. వినడంతోనే గుండె తరుక్కుపోతోంది. అయ్యో, తల్లీ, అయ్యగారూ మీరూ ఎల్లా ఒప్పుకున్నారమ్మా, ఇల్లాంటి పని చేయడానికి?

సర్వ - దానికో కారణం ఉంది. దాసీ, అయ్యగారికి ఆచార్యులమీద కొండంత విశ్వాసము. ఆచార్యులు కరుణాస్వరూపులు. మన మనస్సు పరీక్షించడానికి మాత్రం వారు అలా అంటారు. అంతేగాని - అలాంటి ఘోరకృత్యాలేవీ మనచేత ఎన్నడూ చేయించరు అంటారు అయ్యగారు.

దాసి - అయితే - అనవసరంగా మీ కెందుకు తల్లీ ఇంత దిగులు?

సర్వ - కాదు దాసీ, నాకు అయ్యగారి మాటల్లో అంతగా విశ్వాసంలేదు. రాత్రి అంతా ఆచార్యులు నాకు భయంకరంగా కనబడి జాగ్రత్త! నీవు ఈ దీక్ష విడవడానికి వీల్లేదు అన్నట్టు కల వచ్చింది. సిరియాళుడు అంతకంతకి ఎక్కువగా కలవరిస్తున్నాడు. ఒకవేళ,! అనకూడదుగాని - వారు అన్న దానికంటె ఎక్కువ పరీక్ష చేస్తే... ఏదైనా తలపెట్టకూడని ఘోర పరిత్యాగం చెయ్యమని ఆజ్ఞాపిస్తే......

దాసి - [చెవులుమూసుకుని] శివశివా అల్లాంటిమాటలు అనకండి తల్లీ. నేను వినలేను. ఏమమ్మా ఈ దీక్షలు! ఎంతకైనా తగుదురమ్మా ఈవీరశైవులు.

ఒకవేళ మీ ఆచార్యులు మీరు భయపడుతూ ఉన్న పనినే చెయ్యమంటారనుకోండి. అప్పుడేం చేస్తారమ్మా మీరు?

సర్వ - ఇంక చేసేది ఏముంది? కొంప గుండమై పోయిందన్నమాటే.....అదే దాసీ! తలచు కుంటే నాకు బెంగగానూ భయంగానూ ఉంది. ...ఏమి చెయ్యను? అయ్యో నాయనా......

దాసి - ఎందుకమ్మా, ఇంత ఆలోచన దేనికి? వెం టనే ఆచార్యులకు ఈ వ్రతం మేము చెయ్య లేమని కబురు పంపించండమ్మా. చూస్తూ చూస్తూ భర్తనూ, కన్న కొడుకునూ బలి వేసుకుంటా రమ్మా ఎవరైనానూ? కావలిస్తే మేకలూ గొర్రెలూ బలివేయగూడదా తల్లీ?

సర్వ - అవును దాసీ. ఎంత వెర్రిదాన్నైపోతు న్నాను. నువ్వు చెప్పినట్టు ఆచార్యులు అవిగంగా పరీక్షిస్తే ఇంకేముంది? అయ్యో నాకన్నతండ్రీ... ఇంక ఏమైనా సరే ఈవ్రతం జరగనిచ్చేది లేదు. - [[illegible]] - అదిగో అయ్యగారు వస్తున్నారు కాబోలు!

దాసి - అవునమ్మా. అయ్యగారే. నేనైనా వెలు తానమ్మా వారితోటి.

సర్వ - నువ్వు చెప్పక్కరలేదులే. తొందరగా వెళ్లి తలుపు తీసిరా......ఒకవేళ - ఒకవేళ ఆచా ర్యులు సిరియాళునే పూర్ణాహుతిగా సమర్పించ మంటే - అబ్బా, ఇంకేముంది. అయ్యో నాయనా! ఎంత ద్రోహం తలపెడుతున్నాను నేను. ఆ భిక్షుకబాలునికి ఉన్నంత అదృష్ట మైనా లేదా నీకు.........ఇదేమిటి ఇల్లా అను కుంటున్నాను ... [ఉద్వేగంతో] ... ఏమైనా సరే. ఈ పూర్ణాహుతి జరగనివ్వను నేను. అటు సూర్యుడు ఇటు ఉదయించినా ఇది జరగనే జరగదు!

శశాంక - సర్వమంగళా......ఏ విషయం, అల్లా దీర్ఘంగా ఆలోచిస్తున్నావు? ఆ కన్నీళ్లేమిటి?... ...ఏమి జరిగింది, ఎందుకు నీకీ విచారము?

• •

సర్వ - [వెక్కి-వెక్కి ఏడుస్తుంది] -

శశాంక - ఇదేమి సర్వమంగళా? ఎందుకని ఈ దుఃఖమంతా నీకు? నాతో కొంచెము చెప్ప కూడదా?

సర్వ - [[illegible]] - మీ పాదాలే నాకు శరణం. నన్ను క్షమించాలి!

శశాంక - క్షమించడం ఎందుకు?

సర్వ - క్షమిస్తానంటేనే గాని నేను చెప్పలేను!

శశాంక - అసలు విషయమేమో తెలియందే ఎల్లాగ క్షమించడం?

సర్వ - కాదు! నన్ను క్షమిస్తానంటేనే గాని మీ పాదాలు వదలను.

శశాంక - పోనీ, కారణం చెప్పగూడదా? ఒక్క సారి?

సర్వ - మీరు క్షమిస్తానని వాగ్దానం చేస్తే చెబు తాను.

శశాం - పోనీ క్షమిస్తానులే. పాదాలు విడిచిపెట్టు. చెప్పవలసింది చెప్పమరి.

సర్వ - ఏమైనాసరే పూర్ణాహుతి జరగడానికి వల్ల కాదు.

శశాంక - అదేమిటి అల్లా అంటున్నావు? ఇంతలో నీ కేమి జరిగింది?

సర్వ - ఏమీ లేదు. ఒకవేళ ఆచార్యులు సిరియాళుని పూర్ణాహుతిగా ఇమ్మంటే నాగతి ఏమి కావల సింది? ఒకసారి చెప్పండి.

శశాం - నీవు ఆచార్యుల దగ్గిర సమస్తమూ విడిచి వేయడానికిన్నీ - చివరికి, అవసరమైతే నా శిర స్సైనా పూర్ణాహుతిగా సమర్పించడానికిన్నీ, సిద్ధమైనావు కదా? మరి యిప్పుడు ఇవేమి మా టలు సర్వమంగళా...రేపే కదా మహాశివరాత్రి! ఈ సమయంలో నీవు ఇలా అనవచ్చునా? ఛీ!

సర్వ - [ఉద్వేగంతో] అవును నేను ఆచార్యులదగ్గర కొంచెము తొందరపడి ముందు వెనుకలు చూడ

కుండా నా అంగీకారం ఇచ్చాను! ఇప్పుడు ఈ దీక్ష నా కెంతమాత్రమూ ఇష్టము లేదు.

శశాంక - ఎంత చిత్రంగా మాటలాడుతున్నావు. ఆవేళ నీ అంతట నీవే ఆచార్యుల ఆశ్రమానికి బయలుదేరి వచ్చి నీవే దీక్ష స్వీకరించావు గదా. ఆచార్యులు మాటిమాటికీ రెట్టించి, రెట్టించి, నీ అభిప్రాయం ప్రశ్నించారు గదా? జ్ఞాపకం ఉన్నదా నీకు? ఆపైన నీ నిశ్చయం ప్రమాణ పూర్వకంగా ఆచార్యులకు విన్నవించావు కూడాను. ఇప్పుడు వారు నీమాటలు వింటే ఏమంటారు? ఈ మాటలు వింటే లోకులంతా నిన్నూ నన్నూ చూచి విరగబడి నవ్వరా?

సర్వ - నన్ను క్షమించండి. మీ పాదాలకు నమస్కరిస్తున్నాను. ఒక్క విషయం చూడండి. మన సత్యప్రాప్తికీ, మన మోక్షోపాయానికీ సిరియాళుని బలివేయడం తలచుకుంటే నా ఒళ్ళు జలదరిస్తోంది. ఎక్కడైనా ఉన్నదా ఈ అన్యాయం? ఇంతకంటె అసిపత్రనరకమైనా నాకు మేలే.

శశాంక - ఎంత కష్టమైన మాట. మన సత్యాన్వేషణంకోసం సిరియాళుని బలివేయమని ఆచార్యులు నిన్నూ నన్నూ ఎప్పుడైనా అడిగినారా? సిరియాళుని బలివేయమని యెవరన్నారు? వస్తే ఒకవేళ వారు ప్రాణాలు అర్పించమన వచ్చును. ఆమాట వారు నిన్నే అడగవచ్చును. లేక మన సర్వస్వమూ విడిచి సన్యసించ మనవచ్చును! ఇంకా మరి ఏదైనా పరిత్యజించ మనవచ్చును. ఏమీ అక్కరలేకుండానే ఏ పత్రమో పువ్వుమో పూర్ణాహుతిగా అర్పించ మనవచ్చును.

సర్వ - ఒకవేళ సిరియాళునే వారు పూర్ణాహుతిగా సమర్పించమంటేనో?

శశాంక - దానికైనా సరే మనము నిస్సందేహంగా నిర్భయంగా సిద్ధంగా ఉండవలసిందే. మాట ఇచ్చిన తరవాత తప్పవచ్చునా?

సర్వ - అంతేనా...... అంతేనా......అయ్యో.

శశాంక - అంతే. ఆచార్యుల హస్తాల్లో మన సర్వస్వమూ మన సమస్త ప్రాణాలూ సమర్పించి కేవలమూ అచంచల విశ్వాసంతో నిలబడవలసిందే.

సర్వ - అయ్యో మీ మాటలు వింటూన్నకొద్దీ నా హృదయం మరీ ఆఘాతమై పోతోంది! మనం అందరమూ మరణించిన పిమ్మట ఆ మహా సత్యాన్వేషణ ఎవరికి?

శశాంక - సర్వమంగళా. నీవు అనేక సందేహ తరంగాలలో ఉక్కిరి బిక్కిరి ఐపోతున్నావు. ఆచార్యులు, ఒకసారి, మన హృదయానికీ బుద్ధికీ అతీతమైన మహోజ్జ్వల సత్యస్వరూపం జననమరణాలకు అతీతమైనదని సెలవియ్యలేదా? అసలు జనన మరణాదులే అసత్యాలు, మనం మన అనుభవాలతో ఆ మోక్ష స్థితిలో ఉన్న అనుభూతిని కొంచెమైనా గ్రహించలేమని ఆచార్యులు సెలవిచ్చిన వాక్యాలు మరిచి పోతున్నావా?

సర్వ - లేదు. ఆ విషయం నేను మరిచిపోలేదు. కాని......కాని...... నా హృదయం అంధకారంలో ఈదులాడుతూ ఉంది. ఒకప్పుడు ఆచార్యుల మాటల్లోనే నాకు అవిశ్వాసం కలుగుతూ ఉంది. నేనేమి చెయ్యగలను. మళ్ళీ ధైర్యం కలిగేవరకూ ఈ పూర్ణాహుతి ఆపి చెయ్యగూడదా? నన్నేదో భయపిశాచం కంఠం నులిమివేస్తూన్నట్లుగా ఉంది!

శశాంక - ఈ స్త్రీల స్వభావం ఎంత చిత్రమైనది. నీవు పూర్వవిషయాలు పూర్తిగా మరిచిపోతున్నావు సర్వమంగళా. ఆ దివ్యపురుషుడూ ఆ స్వప్నమూ ఇంతలోనే మరిచిపోయావా? అది అపూర్వమైన స్వప్నమనీ, దానివల్ల తప్పక కార్యసిద్ధి చేకూరుతుందనీ, దీక్ష స్వీకరించమనీ పురోహితులు మరీ మరీ అన్నమాటలు కూడా నీకు ధైర్యం కలిగించడం లేదా?

సర్వ - .........ఉండండి......ఆగండి......

అన్నట్టు ఔను. నాకు మీ మాటలవల్ల ఇప్పుడు కొంత ధైర్యం కలుగుతూ ఉంది! అన్నట్టు... నిజమే...... ఎంతలో ఆ విషయం మరిచిపోయాను నేను. ఇదేమిటీ భ్రమ నాకు!

శశాంక - అదీగాక, ఆ స్వప్నవృత్తాంతం ఆచార్యులు కూడా విని, ఇది మిక్కిలి శుభదాయకమైన స్వప్నమనీ, దీనివల్ల దీక్షా, పూర్ణాహుతి నిర్విఘ్నంగా నెరవేరగలవనీన్నీ మన కుటుంబానికి అంతకూ ఒక కళ్యాణఫలం చేకూరగలదనీన్నీ అన్నారు గదా? మరి ఇంకా నీకు ఎందుకీ సందేహమూ భయమూను!

సర్వ - మీ మాటలు వింటే నేనేదో సుఖస్వప్నంలో ఉన్నట్టున్నాను. పూర్తిగా ధైర్యం కలుగుతూ ఉంది. ఎంత ఆధైర్యపడుతున్నాను నేను ఇంతకు పూర్వం.

శశాంక - ......... నీలోనూ నాలోనూ ఒక ముఖ్యమైన భేదం కనబడుతూ ఉంది నాకు సర్వమంగళా! నాకు!

సర్వ - ఏ విషయంలో ఆ భేదం?

శశాంక - నీకు ఆచార్యులమీద సుస్థిరమైన విశ్వాసం లేదు. నాలో నీకు కలిగిన సందేహాలు కలగనే లేదు. నాకు ఆచార్యులమీద దుర్భేద్యమైన విశ్వాసమూ భక్తీ ఉన్నాయి. వారు ప్రళయాగ్నిలో ఉరకమన్నా నేను కళ్ళుమూసుకుని ఉరకగలను. వారు అపార కరుణాస్వరూపులనీ, ఆ మహాసత్య శిఖరానికి సురక్షితంగా మనలను చేర్చబోతున్నారనీ నాకు విశ్వాసం. నీలో ఆ ధైర్యమూ ఆ విశ్వాసమూ లేనే లేవు?

సర్వ - నాకు ఆచార్యులయందు మీ కున్నంత స్థిర విశ్వాసముంది. వారి ముఖం చూస్తూ ఉన్నంతసేపూ నాకు ఏవిధమైన భయమూ సందేహమూ కలగదు. కానినిద్రపోతూన్న నాసిరియాళుని ముఖంచూస్తూ ఉంటేఆవిశ్వాసంఅంతాపటాపంచలైఎగిరిపోతుంది. నేనేమిచేయగలను? నా హృదయంఅల్లాంటిది. ఇప్పుడుమీమాటలవల్ల మళ్ళీఏదో కలలో ప్రవేశించినట్టుంది నాకు. సిరియాళుని గురించి ఉన్న భయంకూడా పోయింది. ఇంక భయపడను. నిశ్చయంగా చెబుతున్నాను.

శశాం - నిజంగానేనా! సర్వమంగళా!

సర్వ - నిజంగానే.

శశాం - నా దగ్గర నీ హృదయం దాచకు. నిర్భయంగా నీ సందేహాలు తీర్చుకోవచ్చును. నాకోసం మాత్రం నీ కనిష్టమైన విషయం అంగీకరించవద్దు. అది కేవలం నిష్ఫలం.

సర్వ - [ధైర్యంతో] - నేను మీ మాటల్లో సత్యం గ్రహించగలుగుతున్నాను. ఒకప్పుడు మీ అభిప్రాయం ఒక మెరుపులా మెరిసి నాకు ధైర్యం చేకూరుస్తూ ఉంది. నేను నిశ్చయంగానే చెబుతున్నాను. కాని నాది దుర్బల హృదయం. ఒకప్పుడు తుపాను రేగినప్పుడు మాత్రం మీ సహాయం లేకపోతే నే నీ దీక్షాసాగరం ఈదలేను. నేనేమి చేయగలను? నాది అల్లాంటిస్వభావము. నన్ను కరుణించాలి.

శశాం - భయంలేదు. నటరాజేశ్వరుని కరుణాప్రసారంవల్లనూ ఆచార్యుల కటాక్షం వల్లనూ నీకు స్థిరధైర్యం కలుగుతుంది. అంతవరకూ మనము ప్రతిదినమూ రుద్రమూర్తిని ఆరాధించడమే చేయవలసిన విధికృత్యము.'

సర్వ - నాకు క్షణంలో ఏదో మహాభయం ఆవరిస్తూ ఉన్నట్లుంటుంది. క్షణంలో అఖాతంలో కూలిపోతూన్నట్టు అనిపిస్తుంది. నేనేమి చెయ్యను? నాకీభయం ఏవిధంగా పోతుందోగదా.

శశాంక - ఇంత భయం నీకెందుకు? నీవు ఆ పరమేశ్వరునివలలో కేవలం ఒక అంగుళివంటి దానవు. నాకున్నూ అటువంటి దృఢ విశ్వాసం ఉంది. జరగవలసినది ఏదో తప్పక జరిగి తీరుతుంది. అది కేవలమూ ఆ నటరాజేశ్వరుని లీల. కనుక మనం దృఢభక్తితో ఒకసారి ఆ పరమేశ్వరుని ప్రార్థించి మన భారం ఆయనకే వదిలివేదాము.

[ఇద్దరూ మౌనంగా నిమీలిత నయనాలతో ప్రార్థిస్తారు. ——— తెరలో మంద్రంగా శంఖధ్వని, అది మెల్లమెల్లగా [illegible].]

## ౫

[శశాంకమౌళి భవనము. అగ్నిహోత్ర గృహంలో ఉన్నత స్వరాలతో స్వాహాకారాలు వినబడుతున్నాయి. అప్పుడప్పుడు ఉజ్వలములైన హోమాగ్ని జ్వాలలు లోపలి గోడలమీద నృత్యం చేస్తున్నాయి. దగ్గరగా, చక్కగా అలంకరింపబడిన సిరియాళుని ఎత్తుకొని గంభీరముఖంతో సర్వమంగళ నిలబడి ఉంటుంది. సిరియాళుని కపోలాలూ సర్వమంగళ కర్ణాభరణాలూ, ఆ జ్వాలా నృత్యం అనుసరించి, అప్పుడప్పుడు తళతళ మెరుస్తున్నాయి. దగ్గరగా శశాంకమౌళి ధ్యాననిమీలితనయనాలతో నిలబడి ఉంటాడు. ఆచార్యుడు హస్తాల జ్వాలాపై స్వాహా అని ఒక్కమారుగా కర్పూర ఖండాలు హోమం చేయగా ఆ హోమాగ్ని, జ్వాలాంగుళులు చాచి సిరియాళునివైపు బుసకొడుతుంది.]

ఆచార్య – [హోమం చాలించి లేచి] – ఇప్పుడింక సంపూర్ణాహుతి వేళ అయింది!

శశాంక – అవును స్వామీ......తమ ఆజ్ఞకై వేచియున్నాము!

ఆచార్య – అమ్మా, సర్వమంగళా! నీవున్నూ సర్వసిద్ధమేనా?

సర్వ – చిత్తం. సర్వసిద్ధంగానే ఉన్నాను.

ఆచార్య – వాడియైన కరవాలమూ మొదలైన పరికరాలన్నీ సిద్ధంగా ఉన్నాయా? – దగ్గర చూచి – ఆఁ, అన్నట్టు అన్నీ సిద్ధంగానే ఉన్నాయి. ఇదిగో ఇంక పూర్ణాహుతి ముహూర్తం ఇంచుమించుగా ఒక గడియ మాత్రమే ఉంది. ఒక్క విషయం మాత్రం మీరు ముఖ్యంగా స్మరిస్తూ ఉండాలి. అది ఏమాత్రం విస్మరించినా ఈ తంత్రమంతా కేవలం నిష్ఫలం అవుతుంది.

శశాంక – అది ఏ విషయము?

ఆచార్య – ఈ పూర్ణాహుతి సమయంలో మీ యిద్దరి మనసుల్లోనూ, ఏ మాత్రమైన భయం గాని, విచారం గాని, ఉద్వేగం గాని ఉండకూడదు. మీ రిద్దరూ చిరునవ్వులతో ఈ సంపూర్ణాహుతి ఆచరించవలసి ఉంటుంది. మీ యిద్దరిలోనూ ఎవరియందైనా కించిత్తు భయచ్ఛాయ ఉన్నా ఇదంతా నిష్ఫలమై పోతుంది! అనేమపక్షం ఆ పూర్ణాహుతి క్షణం వరకైనా మీ రిద్దరూ నిస్సంశయహృదయాలతో ఇది ఆచరించాలి.

సర్వ – నేను స్థిరధైర్యంతో ఆచరింపగలను. కాని ఆ క్షణంలో నాకు తెలియకుండానే నాలో ఏదైనా భయం ఆవరిస్తుందేమో! తమ ఆశీః పరిభాషణం వల్ల నా భయవినాశనం చెయ్యాలి. నాది మర్త్యలహృదయము. నేనేమి చెయ్యగలను?

శశాంక – నా హృదయంలోనూ ప్రచండ ఝంఝామారుతం రేగుతూ ఉంది. కాని ఆచార్యుల పాదాలు దృఢంగా స్మరిస్తూ ఉండడంవల్ల భయం తొలగిపోతూంది.

ఆచార్య – భయంలేదు. మీకు క్షణంలో అధైర్యం తొలగిపోతుంది. ఒక్కసారి ఆ మహారుద్రమూర్తిని మనసారా ధ్యానించండి.

[శశాంకమౌళి, సర్వమంగళ, నిమీలిత నయనాలతో ధ్యానిస్తారు]

### ౧ పాట

జయ జయ మహారుద్ర జయజయ మహాకాళ
జయ జయ జ్వాలాజ్వలన్నయన గోళా
జయ జయ ప్రచలజ్జటాలోల శారికా
జయ జగత్ప్రళయ సంధ్యాశేష నర్తకా
జయ జయ మహాప్రభూ! భీషణభయంకరా
జయ జయ మహేశ్వరా సర్వలోకేశ్వరా
జయ పదాఘాత సంచయ చూర్ణితాచలా
జయ కరాఘాత సంచరితేందు మండలా
జయ లోకపాలనారంభ దక్షిణకరా
జయ భక్తపాలనామృతమయస్మితధరా.

ఆచార్య – శశాంకమౌళీ, ఇంక పూర్ణాహుతి సమ

యము. నీవు ఇప్పుడు సంపూర్ణ కాంక్షా పరిత్యాగం చెయ్యవలసి ఉన్నది.

శశాంక – గుర్వాజ్ఞ శిరసా వహిస్తున్నాను.

ఆచార్య – నీవు ఆ అనంత తత్త్వం తెలిసికోవడానికై ఈ పూర్ణాహుతి చేస్తున్నావు. ఈ కాంక్ష మీ యిద్దరిలోనూ ఉన్నప్పటికీ, నీలో మిక్కిలి అధికంగా ఉంది. అందుచేత ఆ మహోజ్జ్వల సత్యం పొందవలెనని కాంక్షనే – నీవు పూర్ణాహుతిగా అర్పించవలసి ఉంటుంది. అంటే ఆ సత్య ప్రాప్తి కాంక్షను పరిత్యజించి నీవు పూర్ణాహుతి చెయ్యవలసి ఉంటుంది!

శశాంక – నేను ఆచార్య వచనం గ్రహించలేకుండా ఉన్నాను. పరిపూర్ణ సత్యం స్వరూపం గ్రహించవలెననే కాంక్షనే విడిచి, నేను పూర్ణాహుతి చెయ్యవలెనా? నాకు ఏదో కొంత సందేహంగా ఉంది! ఆచార్యపాదులు నా సందేహ వినాశనం చెయ్యాలి!

ఆచార్య – ఇది కొంచెము సూక్ష్మమూ దుర్జ్ఞేయమూ ఐన విషయం. కాంక్షాలేశం గాని మోహ పరమాణువుగాని మిగిలిన హృదయం కలవారు ఈ దీక్షకు అనర్హులని ముందే చెప్పి ఉన్నాను గదా. ఇంతలో నేనా విస్మృతి!

శశాంక – శిష్యాపరాధం క్షమించాలి. నేను తమ వాక్యంలో అంతరార్థం గ్రహింపగలుగుతున్నాను. అబ్బా, కాంక్ష విడిచి పూర్ణాహుతి ఆచరించడం ఎంత విషమమైన విషయం! నేను గ్రహించాను. తమరు ఆదేశించిన వాక్యం ఏమరకుండా స్థిరమైన హృదయంతో పూర్ణాహుతి ఆచరించగలను. ధైర్యము తిరిగి కలిగింది.

ఆచార్య – సరే నీకు భయములేదు. అయినా క్షణం రుద్రమూర్తిని ధ్యానిస్తూ ఉండు......... అమ్మా! సర్వమంగళా, నీ సర్వస్వమూ సమర్పించే వేళ సమీపించింది. నీవు స్థిరభావం ధరించాలి.

• •

సర్వ – నాకు రుద్రమూర్తి కారుణ్యంవల్ల ధైర్యం కలిగింది. తమ ఆజ్ఞ కోసం నిరీక్షిస్తున్నాను.

ఆచార్య – నీవు ఈ క్షణంలో నీ సర్వస్వమూ పరిత్యజించవలెనుసుమా.

సర్వ – నేను సర్వస్వమూ పరిత్యజించగలను. అవసరమైతే ఆ కరవాలంతో నా శిరస్సు ఖండించి ఆహుతిగా సమర్పిస్తాను. ఆ ఖడ్గం దయ చెయ్యండి. క్షణంలో ఇది ముగిసిపోతుంది!

ఆచార్య – ఆగు. ఆ ఖడ్గంతో ఇప్పుడు నిమిత్తం లేదు.

సర్వ – ఎందుచేత?

ఆచార్య – నీ సర్వస్వమంటే నీ శరీరం మాత్రమే కాదు!

సర్వ – మరి ఎవరి శరీరము? నా భర్తృశరీరమా!

ఆచార్య – కానే కాదు.

సర్వ – మరి ఎవరి శరీరము!

ఆచార్య – నీ సిరియాళ కుమారుని శరీరము!

సర్వ – అబ్బా! చివరకు భయపడినంత పనీ జరిగింది. తమరు నన్ను కరుణించి నా శరీరం సమర్పించ మనగూడదా? నా చేతులతో నేనీ ఘోర కృత్యం చెయ్యగలనా? నన్ను కరుణించండి. అబ్బా.

ఆచార్య – [తీవ్రంగా] – అది ఎంతమాత్రమూ వల్లకాదు. నీవు నా ఆజ్ఞ అనుసరించి సిరియాళుని ఆ హోమజ్వాలలో అర్పించవలసిందే.

సర్వ – [గద్గదికతో] – నామీద కొంచెము కరుణించండి. నా సిరియాళుని రక్షించండి. నేను ప్రార్థేయపడుతున్నాను. క్షమించండి.

ఆచార్య – నీవు ఏ కారణంచేత సిరియాళునికై ప్రార్థిస్తున్నావో, ఆ కారణంచేతనే నీవు సిరియాళుని ఆహుతి చెయ్యాలని శాసిస్తున్నాను. ఇది తత్క్షణమే నిస్సంకోచంగా నీవు ఆచరించాలి. కాలం మించిపోతూంది.

సర్వ - [మౌనంగా, గంభీరంగా ఉన్నస్తూలివలె నిలబడి ఉంటుంది.]

శశాంక - సర్వమంగళా, ఆచార్యుల ఆజ్ఞ మనం వెంటనే శిరసావహించవలెను గదా...

సర్వ - [మౌనం] -

ఆచార్య - ఇంక ఒక విఘడియ మాత్రమే అవధి. నేను కాలగళాయ పరమాత్మనే స్వాహా అనగా ఆహుతి జరిగి పోవాలి.

సర్వ - [మాటలు ఏమాత్రమూ వినబడనిదానివలె నిశ్చలంగా ఆ జ్వాలవైపు చూస్తుంది.]

ఆచార్య - సర్వమంగళా, నిశ్చలహృదయంతోనూ చిరునవ్వుతోనూ నీవు ఆహుతి చేయవలసిన సమయము సుమా ఇది. సర్వమంగళా! అమ్మా! సర్వమంగళా! ఏమి మాట్లాడవు......శశాంక మౌళీ! ఏమి సర్వమంగళ మాట్లాడదు?

శశాంక - సర్వమంగళా! సర్వమంగళా(గట్టిగా)- సర్వమంగళా, ఏమి సర్వమంగళా, వెర్రిదానివలె ఆవిధంగా చూస్తున్నావు. ఎంత పిలిచినా పలకవేమి? ఏమిటిది?

సర్వ - [నిద్రలోనుంచి లేచినదానివలె ఉలిక్కిపడి] ఏమిటి? ఎందుకని అల్లా పిలుస్తున్నారు నన్ను?

శశాంక -నీకు ఆచార్యులమాటలు వినబడడం లేదా?

సర్వ - ఏమిటిది? ఆచార్యులు ఏమన్నారు?

శశాంక - పూర్ణాహుతి సమయమైనదనీ వెంటనే ఆహుతి అర్పించమనీ ఇప్పుడే అన్నారుగదా ఆచార్యులు!

సర్వ - ఇదేమిటీ, ఆశ్చర్యం? నాకు ఒక్క అక్షరమూ వినబడలేదే!

ఆచార్య - సర్వమంగళా, నీవింక పూర్ణాహుతి అర్పించనేలేవు. నీ హృదయం విచారసముద్రం లో మునిగి తేలుతూ ఉంది.

శశాంక-ఇదేమి సర్వమంగళా, ఇంతలోనే అజ్ఞానమా నీకు?

సర్వ- నే ననుకున్నట్లు నాకు తెలియకుండా నే నన్ను దుఃఖాంధకారం ఆవరించింది. నామీద కరుణించండి. ఈపైన వెంటనే మీ ఆజ్ఞ నెరవేరుస్తాను.

ఆచార్య - ఇంక అవకాశం లేదు. కాలం మించిపోతూంది. నమశ్శివాయ, భీషణ భయంకరాయ స్వాహా,అనగానే నీ శిశువును వినిశ్చల హృదయంతో ఆ జ్వాలలో సమర్పించాలి. ఇదిగో అంటున్నాను. ఓ నమఃశివాయ భీషణ భయంకరాయస్వాహా.

సర్వ - ఒక్కక్షణం ఆగండి. సిరియాళుణ్ణి కళ్ళారా ఒకసారి చూడనీయండి.ఒక్కసారి. ఒక్కసారి తనివితీరా ముద్దాడనీయండి [సిరియాళుని ముద్దాడుతూ ఉంటుంది]

ఆచార్య - [క్రోధంతో] - మీరింత కేవలమూ దుర్బల హృదయులన్నమాట ఇంతకు పూర్వం తెలిసికోలేకపోయాను. శశాంకమౌళీ, నీవు కేవలం నన్ను మోసగించావు.

సర్వ - నేను కనుపాపగా కన్నదానను గదా. నా హృదయవేదన ఎవరికి తెలుస్తుంది. ఒక్కక్షణం క్షమించకూడదా? మీ ఆజ్ఞకు నేను వ్యతిరేకించడం లేదుగదా. ఒక్క క్షణం ఆగండి.

ఆచార్య - [ఉద్వేగంతో] - నీవు ఆలస్యం చేస్తే కాలం మించిపోయి సమస్తమూ వ్యర్థమైపోతుంది. కాలం ఆసన్నమైంది. ఇది అతిక్రమిస్తే సమస్తమూ నిష్ఫలం! నిష్ఫలం!

శశాంక - ప్రభూ, పోనీ, ఆ ఆహుతి నేనే సమర్పిస్తాను. నేను సమర్పించకూడదా అది?

ఆచార్య - కూడదు. ఎంతమాత్రమూ కూడదు. ఆ ఆహుతి ఆమె మాత్రమే సమర్పించాలి!

శశాంక - [నిష్ఠురంతో] - ఏమి సర్వమంగళా, నీ ఆలస్యము? నీవు ఎంత అజ్ఞానంలో పడిపోతున్నావు? ఒక నిమిషంలో పూర్ణాహుతి కాలం మించిపోతుంది కదా. ఒక్కసారి ధైర్యం అవలంబించలేవా? ఎంత భీరురాలవైపోతున్నావు! నీకు ఎంతసేపు - ఎంతసేపని బోధించగలను! ఇంత భీరురాలవనుకో నేలేదుసుమా ఎన్నడూను

ఆచార్య - ఇంత దుర్బలహృదయురాలైన నీవు నాకు శిష్యురాలైనందుకు నేను భరింపలేనంత లజ్జాభావంలో కృంగిపోతున్నాను - సరే ఇక కాలం మించిపోతుంది! ఇదంతా వ్యర్థము, వ్యర్థము.

సర్వ - [కోపంతో] - అబ్బా! అబ్బా! నేనుమాత్రం మీ మాటను వ్యతిరేకించానా? నాహృదయంలో ఉన్న హాలాహలమూ, అగ్నిజ్వాలా - కఠిన హృదయులైన మీ కేమి బోధపడుతుంది. ప్రపంచంలో ఏ జననియైనా నావలె తన శిశువును చేతులారా ఆహుతి చేసిందా! నా [illegible] కారణంవల్ల నా కీగతి పట్టింది. మీరు మనుష్యులా. రాక్షసులా? మీకు హృదయమే లేదా? - [illegible] -

ఆచార్య - [illegible] - చాలు చాలు. ఇంక ఈ విషయం చాలు. మీరిద్దరూ కూడా ఇటువంటి దీక్షకు అనర్హులు. పిరికిపందలు. [illegible] మీ వల్ల కళంకితమైంది. నే నీ గృహంలో ఇక నిలవలేను. నా హృదయం [illegible] ముక్కలై పోయింది. ఈ పూర్ణాహుతి ఇక చాలును. నేను వెళ్ళిపోతున్నాను......

శశాంక - సర్వమంగళా, సర్వమంగళా! ఎంతెంత అపచారం మాటలు అని ఎంతెంత మహాపరాధం చేశావో నీకు తెలుసునా? వారిని క్షమాపణ వేడుకో. ఆశ్చర్యం! ఇదేమి సర్వమంగళా! ఇంతలో ఇంత భీరురాలవై పోయావా? నీవు పరమ మాహేశ్వరులైన వీరశైవులవంశంలో జనించిన వీరశైవవనితవు గాదా? ఇంతలోనే నేను చెప్పిన సమస్తమూ విస్మరించావా? నీవల్ల మన వంశం ఎంత అప్రతిష్ఠపాలై పోతూవుందో ఊహించావా? అయ్యో ఆచార్యులు క్రోధంతో వెళ్ళిపోతున్నారు. ఒక్కసారి. ఒక్కసారి. ఒక్కసారి నిశ్చలంగా ఆలోచించి సుస్థిరంగా నిలబడు. మనస్సు చెదిరిపోనీయకు.

సర్వ - [స్తంభిత కోపంతో]- ఏమంటున్నారు. నేనేమన్నాను. ఏమన్నాను. అయ్యో నా మనస్సు ఇలా చెదిరి పోయిందేమిటి? ఆచార్యదేవా, ఆగండి. నన్ను క్షమించండి. ఇదిగో ఇదిగో నాకు వజ్రధైర్యం ఉంది. నేను భీరురాలను అనుకుంటున్నారా? నాలో మహా ప్రళయం స్తంభించి ఉంది. నేను హోమాలను స్థైర్యంతో నిర్వహిస్తాను. ఇదిగో చిరునవ్వు నవ్వుతున్నాను. నేను భీరురాలనా? నేను భీరురాలనా? మీరు భీరువులు. మీరు, భీరువులు. హ హ్హ హ్హ [illegible]

ఆచార్య - ఆఁ! ఆఁ! నీవు ఈ ఉద్వేగంలో పూర్ణాహుతి ఆచరించకూడదు! అది కేవలం నిష్ఫలం. ఆఁ!

సర్వ - ఏమిటీమాట? ఉద్వేగానికి నేను భీరురాలననుకున్నారా? మీ ఆత్మాభిమానం [illegible] మీరు భీరువులు. ఇదిగో నిర్మల హృదయంతో ఆనందాల విశ్వాసంతో నా శిశువును నా హృదయాన్ని అహుతి యిస్తున్నాను. నమశ్శివాయ భీమ [illegible] స్వాహా. [illegible]

ఆచార్య - [illegible] - సరియైన సమయానికి పూర్ణాహుతి జరిగింది. మీరు ధన్యులు. వెంటనే అనేక రీతిలోపచారాలు చేసి స్పృహ వచ్చేవిధం చూడు. లేలే. విచారసాగరం మీ రుభయులూ తరించారు. అమ్మా అమ్మా సర్వమంగళా, - [illegible]

సర్వ - [illegible] - అని [illegible]

ఆచార్య - [illegible] - అమ్మా, ఒకసారి నా కళ్ళకేసి చూడు. ఇటు చూడు.

శశాంక - [illegible] - ఏమి సర్వమంగళా, నీకా వెర్రినవ్వు. నీకు మతిభ్రంశం జరిగిందా ఏమిటి? ఎందుకా నవ్వు - ఎందుకా నవ్వు? దేనికని?

సర్వ - [కొంత సేపటికి] - అయ్యో నా సిరియాళుడు. అయ్యో నాయనా. నా సిరియాళుణ్ణి నాకివ్వండి. నా సిరియాళుడు నన్ను చూడకపోతే ఒక్క నిమిషం ఉండేవాడు కాదు. నన్ను ఒక్కసారి చూడనీయండి. అయ్యో. నాయనా! [ఘొల్లుమని ఏడుస్తుంది].

ఆచార్య - ఎందుకు సర్వమంగళా, ఆ విచారం? నీ సిరియాళుడు ఎక్కడికీ వెళ్లలేదు. ఇదిగో ఇక్కడే సజీవుడై ఉన్నాడే. ఒక్కసారి నిశ్చలంగా అటు చూడు.

సర్వ - ఎక్కడ, ఎక్కడ, నాకు కనబడ డేమి?

శశాంక - అదేమిటి? ఆచార్యులు అల్లా సెలవిస్తున్నారు? ఇంకెక్కడి సిరియాళుడు మాకు? ప్రభూ! ఇంకెక్కడి సిరియాళుడు?

ఆచార్య - మీకు తృతీయ నేత్రం వికసిస్తూ ఉంది. ఇదిగో ఇద్దరూ కలకల నవ్వుతూ కేరింతలు కొడుతూన్న ఆ హోమజ్వాలలవైపు చూడండి. జాగ్రత్తగా చూడండి. అక్కడ మీకు మీ శిశువు కనబడడం లేదా. చూడండి.

సర్వ - అడుగో, అడుగో. నాకన్న తండ్రి. మంటల్లోకి వెళ్లకు నాయనా. ఇల్లా రా తండ్రీ. ఇదేమి చిత్రం నా తండ్రి అంతటా కనబడుతున్నాడు నాకు.

శశాంక - ఎక్కడ సర్వమంగళా! నాకు కనబడ డేమిటి? ఎక్కడ?

సర్వ - ఇదేమిటి? మీకు కనబడకపోవడమేమిటి? నేను ఎత్తుకుని మీకిస్తాను. ఇదిగో. రా, నాయనా, రా, ఒక్కసారి రా. - [మంటవైపు వెడుతుంది].

శశాంక - ఆహా, ఎంత ధన్యుణ్ణి నేను. మహానంద సాగరంలో మునిగిపోతున్నాను. నాకు సమస్తంలోనూ, ఆచార్యులూ సర్వమంగళా, సిరియాళుడూ కానవస్తున్నారు. నాయనా, ఒక్కసారి రా. ఆహా, ఆచార్యదేవా, మీ అపార నిర్వ్యాజ కరుణవల్ల నేను అనంతసత్యం పొందగలిగాను. నేను మీ ఋణం ఏవిధంగా తీర్చుకోగలను? నా జన్మ తరించింది!

సర్వ - ఇదేమిటి చిత్రం. ఆ జ్వాలల్లోనూ ఆ తోరణాల్లోనూ అంతటా నా సిరియాళుడే కనబడుతున్నాడే, మణికర్ణికా! మణికర్ణికా! ఒకసారి లోపలికి రా!

దాసి - [గాబరాతో] - ఏమమ్మా పిలిచారు? తల్లీ! అంతా అయిపోయిందా తల్లీ? [అయ్యో-ఏడుస్తుంది]

సర్వ - అదేమే పిచ్చిదానా. నా సిరియాళుడు అడుగో, అక్కడ ఆడుకుంటున్నాడే. నా నాయన నాకోసం మళ్లీ కనిపించాడే. నీకు కనబడ్డం లేదూ? చూడు!

దాసి - ఇంకెక్కడి సిరియాళుడు తల్లీ. అయ్యో, ఈపాటికి భస్మమైపోయి ఉంటాడమ్మా. ఏమమ్మా, అలా వెర్రి ఆనందంతో కనబడుతున్నారు? మీకు పూర్తిగా మతికూడా పోయింది తల్లీ. అయ్యో ఎంతపని చేశారు తల్లీ. మాణిక్యంలాంటి పిల్లాణ్ణి హోమం చేసి మీరందరూ మతి పోగొట్టుకున్నారమ్మా ఈవేళ.

సర్వ - నీకు నిజంగా సిరియాళుడు కనబడడం లేదుటే దాసీ?......నిజంగానే?

దాసి-లేదు తల్లీ. ఏమీ కనబడడం లేదమ్మా నాకు. ఇంకెక్కడి పిల్లాడు తల్లీ-[దీనంగా ఏడుస్తూ]-

సర్వ - ఓసిగుడ్డిదానా, నీకు కళ్ళుపోయాయే? నాకూ ఆచార్యులకీ, అయ్యావారికీ కనబడిన పిల్లవాడు నీకు కనబడకపోవడ మేమిటే. చూడు నా పిల్లవాణ్ని నీకు ఎత్తుకోవడానికిస్తాను. ఇందతీసుకో; ఇడుగో!

దాసి - అయ్యో, తల్లి. మీ అందరికీ కూడా పూర్తిగా మతి పోయిందమ్మా. అల్లాంటి పిల్లాణ్ణి చంపిన పాపం ఊరికే పోతుందా?

సర్వ - ఛీ మూర్ఖురాలా. అ. ఇక్కడనుంచి లేచిపో కదులుతావా, కదలవా!

దాసి - అయ్యో పోనీలే. నాకే మరిచిపోయిందమ్మా.
[వెనుతుంది.]

ఆచార్య - అమ్మా, సర్వమంగళా, కొంచెము శాంతించు. నాయనా, శశాంకమౌళీ, ఈ మహా దీక్షవల్ల నీవూ, నీ సహధర్మచారిణీ, నీ కుమారుడూ కూడా శాశ్వతానందధామం చేరుకున్నారు. మీ ఉభయులదీక్షా ఈక్షణానికి సఫలమైంది. మీరందరూ ధన్యులు.

శశాంక, సర్వ - మేమిద్దరమూ ఆచార్యపాదుల పాద పరమాణువులము. మేము చేసిన అపరాధాలు క్షమించండి. మీకరుణాకటాక్షంవల్లనే మేమూ సచ్చిదానందధామం సందర్శించగలిగాము.

ఆచార్య - అమ్మా, ఈ విషయంలో సాధకుని దీక్ష మాత్రమే ఫలదాయకము. నేను కేవలమూ నిమిత్తమాత్రుణ్ణి. మీ పూర్ణదీక్ష ఈవిధంగా నానిమిత్తంవల్ల సఫలం కావలసి ఉంది. ఆ బలీయమైన కేవల పరమేశ్వరముఖవల్లనే అందరమూ ఈవిధంగా పవిత్రించాము. ఆ రుద్రమూర్తి ఇచ్ఛలేనిదే ఒక అంగుళికూడా మనము కదపలేము. అందుచేత మనమందరమూ ముకుళితనయనాలతో తిరిగీ ఒకసారి ఆరుద్రమూర్తినే ధ్యానం చేదాము. నేడు ఎంత ధన్యమైన దివసము. మనమందరమూ ధన్యులము.

["జయ భయంకర రుద్రి" అనే పాట అందరూ పాడుతుండగా తెర పడుతుంది].

# = బాపినాన్న =

## ౧

నాన్నా
నిను చూస్తే
గుర్తించలేని
జన్మజన్మాలగాథలు
జ్ఞప్తికి వస్తా యెందుకో.

## ౨

నాన్నా
దూరాన మబ్బుల్లో
ఏకాంత కన్వష్టా
నువ్వే జ్ఞాపకం వస్తా వెందుకో.

## ౩

నాన్నా
నాజీవిత రథ మిదిగో
తన్ను తా మోయలేక
ఒకసారి చక్రం
ఒకసారి జెండా
వాదిలివేస్తే
అవి కరిగి కన్నీరై
నీ పాదాలకడకు ప్రవహిస్తున్నాయి
కాళ్ళు కడుక్కొని
పరిషత్పీఠం ఎక్కు నాన్నా.

ఇట్లు
నీ ప్రియకుమారుడు
చిరంజీవి

# గురుప్రశంస

## రెంటచింతల లక్ష్మీనరసింహశాస్త్రి

నీ కవనమునం గల వా
డీ కమనీయఘనతి గను నేవేలెచ్చెన్
శ్రీకృష్ణశాస్త్రి! యిదె నీ
కై కావించెద ప్రణామ మందికొనగదే!

రససమాకర్షకముగను రమ్యముగను
కవి రచించిన గీ: మొక్కటియె చాలు
లెక్కకును మిక్కిలిగ వ్రాసి ప్రేపగాక
కవన మగునొకో మెప్పుల గనగలదొకో?

కవి ఓహో నిజంబుగా హృదయకార్కశ్యంబు పోనాడితేన్
వివరింపంగనువే నదిట్టిదని నీవిశ్వాసరాహిత్యమున్
అపమానంబు భరింపలేక వెలికాదట్లిందు ఖేదింపగా
అవిచారంబున కుచ్చెదీపట సనిత్యప్రేమ సిద్ధాంతివై.

ఓకవిరాజహంస! యెపుడో యుపచారమొనర్చినాడ నం
చాకులపాటు నొంద నగునా హృదయాంతర భావలోలవీ
చీ కలనాదమున్ వినిన చింతయు వాయదె విస్మరింపగా
దో కడగన్న కష్టపయ మున్నతభావిపథంబు గాంచరో!

గతి యిప్పట్టున నీవ కాదగుదు మేఘస్వామి! వర్షింపవో
వితతాయుస్సుఫలన్ వ్యథానుగతజీవిన్ జీవిజేయంగదే
అతనూద్వేగము పాలిటన్ బడి వృథాయాసంబులోనైన నా
మతి నాకీయవె పూజనీయపదపద్మా! కృష్ణశాస్త్రీ! గురూ.

ఈ యరిపేదగొంతు విలపింపుల నోపును వెటులో గదా
యే యపరాధమో యిది సహించెదు నే డిట నశ్రుధారగా
న్యాయమె కృష్ణశాస్త్రి ? విజనాటవిలో జనునట్లు వీని నీ
వీయెడ కీ దయారహితవీథికి పొమ్మని పారవోయుటల్.

పొగడితి ని న్ననేకజన ముఖ్యసభాస్థలులందు బాడితిన్
తగవగుచోట త్వ న్మృదులదక్షిణమందసమీరగీతముల్
నగువొ తిరస్కరించెదొ యనాదరణం బొనరించెదో మదీ
య గురునిగా దలంచి యిపు డర్పణసేసిన యీ శుభాంజలిన్.

తొలుత సఖుండుగా పిదప దుర్జయసత్కవిలోకనాథుగా
కొలిచితి నిన్ను మద్గురుని కోటిహృదంబుజచంచలాళిగా
అలఘు మదీయకావ్యముల కబ్బె యశస్సు భవత్కృపారతిన్
నిలిచితి నేడు సత్కరవనేజయుగమ్మును మోడ్చి మ్రొక్కుచున్

# త్యాగము

మిత్రమా!

మీ ఉత్తరము అందినది. చదివి మీరు కోరినప్రకారం వెంటనే చింపి కాల్చివేసినాను. ఈ ప్రత్యుత్తరము వ్రాసేటప్పుడు తిరిగి చదవవలెనని అనుకొన్నాను. ఆ అవకాశము లేకపోయెను. మీ ప్రస్తుత మనః ప్రవృత్తులను విశదపరచుకొనుటకు మీరు వ్రాసినదే నాకు ఆధారము కాబట్టి తిరిగీ మీ ఉత్తరము చదవవలె ననిపించినది. మీరు వ్రాసిన మీ వ్యథ కారణములతో నాకు ఏకీభావము లేదనికాదు. మీయందు నేనారోపణ చేయుటకు ఛిద్రములను వెదకవలెనని కాదు. మీ హృదయమును ఆక్రమించుకొని ఉన్న ముఖ్యభావము ఏది, దాని అంగములు ఏవి - అనే విమర్శన నాలో కలిగినది.

ప్రతీమానవుడు భావవైరుధ్యములో కొట్టుకొంటూంటాడు. భావముల మేళనము క్లిష్టముగా ఉంటుంది. ప్రవృత్తిని విశదము చేయుటకుగాను ఆ భావములను సూక్ష్మముగా విడదీయవలసి ఉంటుంది. వాస్తవముగా ఇట్టి విమర్శన ఎవరికి వారే చేసుకోవలసినదే కాని, అన్యులు చేసినా అది ఆ వ్యక్తి ప్రవృత్తి నిర్ణయమునకు అంతగా సహకారి కాజాలదు. ఇతరులు చేయగలిగేది అట్టి పరీక్షను ఆ వ్యక్తి మనస్సు యెదుట ఉంచడముమాత్రమే. దానిని సానుభూతితో ఆ వ్యక్తి తనమనస్సునకు విశదపరచుకొని తన ప్రవృత్తిని నిరూపించుకోవలెను. వ్యక్తి ఆ పనిని చేయనప్పుడు ఎవరూ ఏమీ సహాయము చేయజాలరు. ఉత్త సలహాలవలన ప్రయోజనములేదు.

తాను అవలంబించినపద్ధతిని సమర్థించుకొనడము మానవ స్వభావము. తనకు హాని కరమని తలంచిన దానినివ్యక్తి చేయడుగదా. కాబట్టి ఉత్తమ పురుషుడు చేయ వలసినదేమంటే తన దృష్టికి భిన్నమైనదృష్టితో తన భావములనూ తన ప్రవృత్తి వ్యవహారమునూ పరీక్షించుకో వలెను. అలాగు మానవుడు ప్రయత్నము చేయనిచో ఎవరి సలహాయైనాసరే ప్రయోజనకారి కాదు. అందుచేత నేను ఈ ఉత్తరము వ్రాయడమునకు ప్రయోజనము మీరు ఉత్తమ పురుషులనిన్నీ (మిమ్ములను పొగడలేదు, మీరు నాకు మాన్యములు ఇచ్చే స్థితిలో లేరు), నేను చేసే విమర్శన మీరు విశదపరచుకొంటారనిన్నీ అట్టి ఆత్మపరీక్షవలన మీకు మనశ్శాంతి కలుగుతుం దనిన్నీ ఆశిస్తున్నాను.

మీహృదయములో రెండు పరస్పర విరుద్ధ భావములు కల్లోలము చేస్తున్నట్లు మీరు వ్రాశారు. సారస్వతసేవ ఒకటి, లౌకిక

విజృంభణము రెండు. మొదటిది స్వల్పము, రెండోది విశాలమైనది; మీ పరిస్థితులన్నిటినీ దానిక్రిందను అంతర్భావము చేస్తాను. భూములు, ధనము, ఋణములు, గృహసంబంధమైన కలతలు, శత్రువులు మొదలైనవి అన్నీ - ఆస్తి పోతున్నది, రైతులు శిస్తులు చెల్లించరు, ఋణములు బాధిస్తున్నవి, గృహ కలహాలు పెరిగిపోయినవి, శత్రువుల తంత్రములు మితిమీరిపోతున్నవి. ఇవన్నీ అన్యోన్య సహకారులు, పరస్పర కార్య కారణములు, ఇవన్నీ తామసరాజసములు. ద్వేష వైర హేతువులు. సారస్వత సేవో సాత్వికము. మీ ఉత్తమ భావములన్నీ దీని క్రింద అంతర్భూతములు. అది శాంతి దాయకము. ఈ రెండూ కలిసి మేళవించవు. ఒకటి మరొక దానికి విషము. ఒకటి మీ హృదయములో పని చేస్తే, రెండోది నశించి తీరును. భోజన సమయమున పట్టుపంచ, బజారుకు నూలుపంచ కట్టుకొనేటట్లు సారస్వత సేవ ఒకప్పుడు, శత్రు వినాశనము మరొకప్పుడు అనే సర్దుపాటు కుదిరేవి కావు అవి. అలాగు చేస్తామని ఆశపడడము ఒక విధమైన భ్రమ. మన హృదయాన్ని మోసపుచ్చి శాంతిపరప చేసే యత్నము. లౌకిక విజృంభణము కావాలనే కోరిక ప్రబలమై హృదయాంతరమును ఊపుతూ ఉండగా, ఆ కారణ కలాపమును బహిరంగముగా అంగీకరించడానికి సిగ్గుపడే హృదయము తనని తాను మోసపుచ్చుకొనుటకు ఈ సమన్వయ ప్రయత్నములను చేస్తుంది. ఈ రెండు పనులను చేసేది ఆ హృదయమే. అదే దాని చమత్కారము. మానవ చైతన్యమునకు గల విశేషమే యిది. అదే స్వాపరీక్ష కూడా చేసుకో గలదు. ఆ పరీక్షకు కావలసిన రెండు పరికరాలూ అదే. తనను తానే పరీక్షిస్తుంది. మానవ హృదయము అల్పోత్కృష్ట భావములకు ఆశ్రయము. ఉత్కృష్ట భావములకు ఆశ్రయమైన హృదయము అల్పభావములకు ఆశ్రయమైన హృదయమును విమర్శిస్తుంది. ఆ విమర్శన వలన పుట్టిన అసంతృప్తిని చల్లార్చుకొనుటకు హృదయము అవలంబించే సమాధాన కలాపములో ఇది ఒక పద్ధతి.

సారస్వత సేవ ఉత్కృష్ట భావమని అందరూ అంగీకరించుచుండుట చేతనూ, దానికిన్నీ లౌకిక విజృంభణమునకూ స్వతః వైరుధ్యము ఉండుట చేతనున్నూ, ఈ మోస ప్రయత్నము అవశ్యకమైనది. వీటికి గల విరోధము తుడిచి వేయడానికి అది అంత దుర్బలమైనది కాదు. రెండింటినీ మేళవించి పోషించడము జరగదు. ఒక దానిని పూర్తిగా తొలగించినప్పుడే రెండోది సాధ్యమగును. లౌకిక విజృంభణము హృదయమున ఆవేశించి ఉన్నప్పుడు, సారస్వత సీమకు అవకాశ ముండదు. ఈ ఆవేశము హృదయమున అంకురించినప్పుడు తిరిగి సులభముగా ఎండిపోదు. భోజనమప్పుడు పట్టుపంచ,

బజారునకు నూలుపంచ కట్టుకొనేటట్లు, సారస్వతసేవ రాత్రి, లౌకిక వ్యాపారము పగలు చేస్తామని ఆశపడడమే హృదయము తన అధమసోపానమునుండి కల్పించిన మోసము. శారీరక మానసిక వృత్తులకు గల భేదమును సూక్ష్మముగా పరిశీలిస్తే ఈ వైరుధ్యము స్పష్టపడుతుంది. శరీరము నకు శరీర వృత్తులు అంటుకొనడము కంటె, మనస్సునకు దాని వృత్తులు ఎక్కువ సూక్ష్మముగాను, ఎక్కువ దృఢముగాను అంటుకొంటవి. నిర్జీవమైన సంపర్కానికిన్నీ, జీవవస్తువుల సమ్మేళనమునకున్నూ ఎంత వ్యత్యాస మున్నదో, అంతకంటె చాలా రెట్లు ఎక్కువ వ్యత్యాస మున్నది. శారీరక మానసిక వృత్తుల సమ్మేళనములలో శరీ రమునకు అంటిన మాలిన్యమును తుడిచి వేయుటకు సబ్బు ఉన్నట్లు, మనస్సుకు అంటిన దానిని తుడిచి వేయుటకు ఏమీ లేదు. ప్రాయశ్చిత్త పరితాపములు కూడా పూర్తిగా తుడిచివేయజాలవు.

మనఃప్రవృత్తులు మనస్సును ఆ విధముగా అంటుకొంటవి. అంతేకాకుండా పూర్వ వృత్తి పరవృత్తిని దృఢపరచి పోషిస్తుంది. కాబట్టి పూర్తిగా లౌకికవిజృంభణ వాస నము మీహృదయము నుండి తొలగి పోతేనే గాని మీరు చేయనలచుకొన్న సారస్వతసేవ చక్కగా జరగదు.

"ఎందుకు ఈ మీ ఉపన్యాస మంతా? చూడండి. నేను నావ్యవహారముల మధ్య క్రొత్తగా ఒక కవనము చెప్పినాను. దానిని పెద్ద లందరూ ఆమోదించారు. ఇంతకంటె బలమైన నిదర్శన మెందుకు మీ సమన్వ యమును ఖండించుటకు అని మీరు వాదించ గలరు. నిజమే. మీదమీద చూచినపుడు నా నిర్వచనము తప్పే. మీ కవనవిమర్శ నముగాని మీ సాహిత్యసేవచరిత్రముగాని ప్రస్తుత విచారమునకు లక్ష్యములు గానం దున మీ నిదర్శనతర్కమును నేను సాక్షా త్తుగా ఖండింప జాలను. నా సమన్వయము నిరాక్షేపణీయ సిద్ధాంత సూత్రములపై ఆధారపడి ఉన్నందున నా నిర్వచనము జంకనక్కర లేదని నా విశ్వాసము. మీ నిదర్శనమునకు ప్రత్యుక్తిగా ఒకటి చెప్తాను. మీ హృదయము ఈ కవనకల్పనలో మునిగి యుండెనా? మీ హృదయమునకు ఆ కాలములో అఖండితమైన శాంతి ఉండెనా? ఉన్నట్లైతె, మీ లౌకిక వ్యవ హారములను, ఋణములను, కోర్టు వాయి దాలను, గృహకలతలను, రహితుల అల్ల రులను అన్నిటినీ పూర్తిగా మరచిపోయి నారు గదా. ఉన్నట్లైతే- న పునరావ ర్తతే అన్నట్లు తిరిగి ఆ రాజసవృత్తి మన స్సును ఆక్రమించదు. కాబట్టి అపేక్షము సిద్ధించినది. కవనము మధ్యను గాని అనంత రమున గాని తిరిగి ఆరాజసవృత్తి ఉద్రే కిస్తే, నా విమర్శన రుజువగును. ఆవిధమున నావాదము నిరసింప బడుగాక అని నా కోరిక.

మీ శత్రువులను సాధించుటకు మీరు అవలంబించిన పద్ధతి పూర్వపు వీరులు అవలంబించినదీ కాదు, కేవల మూర్ఖులు ప్రయోగించునదీకాదు. ఈ ఇద్దరు ఉపయోగించునదీ పశుబలమే. ఒకరిది కత్తిపోటు, మరొకరిది దుష్టమంత్రము. ఒక విధమున ఆలోచిస్తే ఇదే ప్రశస్తమైన దేమో కాని, ఈ యుగమునాటి నాగరికతకు సరిపడదు. ఈ నాగరికత పైకి నునుపు, లోపల క్రూరము. ఈ నాగరికత మనకు మప్పినపద్ధతి కోర్టులలో వ్యాజ్యములు నడపడము గదా.

జీవితములో ప్రశస్తమైన భాగమును కోర్టుల వరండాలమీద, ప్లీడర్ల గదులలోను గడపవలెనుగదా! ఈ సేవ మీ హృదయములో ఎట్టి సంచలనును పుట్టించెనో మీరే ఊహించుకోవలెను. ఈ సేవలో మీ ఆత్మగౌరవమును ఎంతక్షీణపరచిరో మీరు జ్ఞాపకము తెచ్చుకోవలెను. విసుగు, జుగుప్స, నికృష్టత మిమ్ములను ఎన్ని మార్లు కుంగదీసినవో మీకే తెలుసును. ఇందువలన మీ ఆత్మకు ఎంత శాంతి కలిగినది? మీ ప్రపంచములో, మీ గ్రామములలో, మీ స్నేహితుల ఆదరములో, మీ బంధువుల సానుభూతిలో మీ ఖ్యాతి, మీ శక్తి, మీగౌరవము ఎంత విజృంభించినవో మీరే విమర్శించుకోవలెను. ఇట్లు ఒక దశ ఉద్యోగముచేసి మీ వ్యాజ్యములలో మీరు పూర్తిగ గెలిచినారు. మీ ప్రతిపక్షులను అణచివేసినారు. మీ ఆస్తులను గట్టిపరచినారు. కాని మీ ఆత్మలో ఈ వ్యాజ్య వ్యాపారములో నెలకొల్పిన ద్వేషము, వైరము, మీ ఆత్మను ఎట్లు నలిపి రూపుమార్చినవో తెలుసుకోవలెను. ఈ తామసప్రకోపము, సాత్వికమైన సారస్వత సేవకు ఆవశ్యక మగు సహృదయమును కాల్చి కాల్చి పాడుచేసి యుండవలెను. సబ్బుతో కడిగి వేయ గలిగిన మాలిన్యము కాదు. అంతవరకు మీ సారస్వత సేవ నిలిచి పోవడమే కాకుండా, ముందు సరళముగా జరగడానికి వీలులేని ఫుండ్లతో మీ కవితాహృదయము చివికి పోయి యుండును.

ఇందుకు తగిన చికిత్స శస్త్రవైద్యము గాని కేపులు ఎక్కించడము గాదు. గంగాస్నానముతో హృదయాంతరములో ఉన్న చీము ఎండిపోదు. మానసికరోగమునకు తగిన చికిత్స ఆత్మీయపరితాపము. దీనికి త్యాగబుద్ధి ముఖ్యసాధనము. త్యాగమే మీరు జపధ్యాన మందు ఉంచవలసిన మహామంత్రము. త్యాగము సాత్విక వ్యవహారము లన్నింటికి బీజము. త్యాగము క్రియ కాదు. బుద్ధియుక్తమైన మానసిక వృత్తి. అది శీలము. స్వభావము. ఆ త్యాగబుద్ధి మీ ఆత్మను ఆక్రమించిన గాని, ద్వేష వైర హేతువైన రాజస తీవ్రత హరించి పోదు. ఒకవేళ పామరులు మిమ్ములను చేతగానివానిగా పరిగణించినా, మీ

హృదయమును స్వాధీనపరచుకొన్న త్యాగశీలము మీకు మనశ్శాంతిని ఇస్తుంది. ఈ శాంతిలేనిదే మీ ఆదర్శమైన సారస్వతసేవ, కవితాహృదయము సంభవములు కానేరవు. "న కర్మణా న ప్రజయా ధనేన త్యాగే నైకేన" అని శ్రుతి. త్యాగము అనగా అన్నీ విడిచివేసి జడునివలె ఉండుమనికాదు. త్యాగబుద్ధి యుక్తమైన సాత్త్వికవ్యవహారము. దాని నిరోధమువలననే హృదయమును వేధించే వైరాదులు పోయి ఆత్మను ఉద్ధరించే శమాదులు విజృంభించును. ఈ స్థితప్రజ్ఞ స్థితి కుదిరినకాని యేచక్కనికార్యమూ సంభవముకాదు. ఇట్లు మీరు ఆత్మపరీక్ష చేసుకోవలెనని ఇంతవరకు వ్రాశాను.

చిత్తగించవలెను.

పారనంది జగన్నాధస్వామి.

# రాజదర్శనము

[ శ్రవ్య నాటిక ]

శ్రీ శివ శంకర శాస్త్రి

| | | |
|---|---|---|
| బాణభట్టు | : | నాయకుడు |
| చండకుడు | : | తాంబూలవాహకుడు |
| చంద్రసేనుడు | : | బాణసోదరుడు |
| మేఖలకుడు | : | లేఖహారుడు |
| భూషణుడు | : | బాణుని పుత్రుడు |
| పారియాత్రకుడు | : | ప్రతీహారుడు |
| శ్రీహర్షుడు | : | చక్రవర్తి |
| కురంగిక | : | సైరంధ్రి |
| * అంబికాదేవి | : | బాణుని భార్య |
| మాలతీదేవి | : | బాణుని మేనత్త |

*ఇందులో అంబికాదేవి నామధేయము మాత్రము కల్పితము. సంస్కృతమున భట్టబాణుని హర్షచరిత్రను అనుసరించి రచించినది.

Δ

## మొదటి రంగము

ప్రీతికూట - అగ్రహారములో భట్టబాణుని భవనము. అపరాహ్ణము దాటుతున్నది. చండకుడు అందిస్తున్న తాంబూలము వేసుకుంటున్నాడు బాణుడు. సైరంధ్రి కురంగిక పాటపాడుతూ గంధము కలుపుతున్నది.

కురంగిక:

నిద్రాలసములైన నేత్రముల్ సహియింప
జాలకున్నవి మణిచ్ఛవిజాలముల నైన
చందన ధూసర శ్యామా కదంబమ్ము
వాసరమ్మున కుముద్వతిభాతి మందమై
కను లసూర్యంపశ్యగా మూసికొన్నయది
పాటలామోద సంభరిత జలములె గాక
వాయువుం గ్రోలంగ వాంఛ యధికం బాయె
ఇనదేపు సంతాపమున గ్రీష్మకాలమున.

బాణుడు : అవును కురంగికా! ఈ నిదాఘ దేవతకు దావాగ్నులే నీరాజనాలు అవుతున్నవి. మంచి గంధము చిక్కన అయింది సుమా.

కురంగిక : మరింత పన్నీరు పటవాసములూ కొంచెము కలుపుతాను స్వామీ! చల్లదనంతోనే కాక సౌరభ్యంతో కూడా మీ కవిశరీరము దశదిశలా ఘుమఘుమ లాడాలి.

బాణుడు : అయితే నన్ను యోజనగంధిని చేయాలని నీ యోచన? కీర్తి దశదిశలా వ్యాపించడం ఉన్నది. దేహసౌరభం దిగంతాలకు తిప్పడమే నేడు క్రొత్తవిషయము కురంగికా!

కురంగిక : మీ యశస్సు ఎలాగూ వ్యాపించింది, వ్యాపిస్తుంది. అంతరంగమే కాక అవయవాలన్నీ ఆమోదభరితము లయితే అత్మలోనుంచి అతిమనోహరవాక్కు బయలుదేరుతుంది.

బాణుడు : మంచిమాట! ఒకవిధంగా నాది అదృష్టజాతకం అనుకోవాలి. నేను ఏమీ రచించకముందే మా మేనత్త నన్ను మహాకవి అంటూ ఉండేది. కాదంబరి ప్రారంభించి పదిశ్లోకాలు చెప్పకపూర్వమే పదిమంది నోళ్లలో పడ్డది.

కురంగిక : ఎవరాపుతారు! పువ్వు పుట్టగానే పరిమళం! ఎంత విశాల మండీ మీ రొమ్ము! అదృష్ట

[ అల్ ఇండియా రేడియో వారి అనుమతిని ]

వతులైన అంగనలు ఎంతమంది దీనిమీద విశ్రాంతి తీసుకున్నారో!

బాణుడు : అంబిక వింటుందేమో అనకు! అదంతా ఆవిడ గృహిణి కాకపూర్వం.

కురంగిక : యజ్ఞోపవీతం పక్కకు తప్పించండి. గంధం పూస్తాను.

బాణుడు : ద్రౌపది సైరంధ్రిగా ఉండి విరాట రాజు భార్య సుదేష్ణకు ఏమో చేసిందిట. నీ నేర్పు చూస్తే నిజంగా ఆవిడమీద ఆదరం పోతుందేమో.

కురంగిక : మీరు నేర్పిన విద్యే. అయినా స్వామి వారిదంతా అతిశయోక్తి. కాదంబరిలో కూడా గాఢంగా అతిశయోక్తి ఉంటుందనుకుంటాను.

చంపకుడు : ఉన్నది ఉన్నట్టు చెపితే ఏం చమత్కారం? అతిశయోక్తిలోనే అందం.

బాణుడు : చంపకా, సున్నం చాల లేదు. బాగా రాచి, నాలుగాకులు ఇలా ఇస్తావా?

కురంగిక : తాంబూలవాహకుడైన చంపకుడు అలంకారికుడయిపోతున్నాడే!

చంపకుడు : ఇదిగో స్వామీ. నెమలి కన్నుల విసనతో స్వామికి కొంచెం విసరనా?

బాణుడు : ఊఁ.

కురంగిక : స్వామికి విసరడంలో నీ అతిశయం కినపడదేమి!

చంపకుడు : పలుకులోనే కాని పనిలో అతి కూడదేమో! గట్టిగా విసిరితే స్వామివారి శిరోజాలు చిక్కు పడిపోవూ!

బాణుడు : ఈ యెండలు ఎంత దుస్సహంగా ఉన్నవి! బైట అడుగు పెట్టలేము కదా — ప్రయాణాలు ఎలా చేస్తారో పాపం! కురంగికా, అరికాలు దురద పెట్టుతున్నది సుమీ!

కురంగిక : అలాగా? అయితే స్వామివారికి ప్రయాణం తగులుతుందేమో?

చండకుడు : కాస్త పక్కకు తప్పుకో కురంగికా. ఏదీ స్వామీ, పాదం ఒక్కసారి ఇలా ఇవ్వండి, సంవాహనం చేస్తాను.

బాణుడు : ఎంత చల్లని హస్తమోయి నీది? పేరు మాత్రం చండకుడు.

చండకుడు : మీ పవిత్ర పాద పద్మాలు పట్టితే ఉత్తమ జన్మ వస్తుందేమో నావంటివాడికి. స్వామీ, తాము బ్రాహ్మణోత్తము లయినా, తమ పాదంలో కొన్ని రాజలక్షణా లున్నవే!

కురంగిక : కవిరాజు అవుతారని సూచన.

బాణుడు : ఏది ఎలా గున్నా, మీరు మాత్రము నాకు రాజోపచారాలు చేస్తున్నారు.

[తలుపుపైన చప్పుడు]

చండకుడు : ఎవరు వారు?

బయటనుంచి ధ్వని—లోపలికి రా వచ్చునా?

బాణుడు : చంద్రసేనా, నీవేనా? రా వోయి తమ్ముడూ, అభ్యంతర మేమిటి?

చంద్రసేనుడు : అన్నగారికి అభివాదనము. ఈ యెండ రాజదృష్టివలె చాలా తీక్ష్ణంగా ఉన్నది తృతీయయామము నడుస్తున్నప్పటికీ.

బాణుడు : దినము పరిణామరమణీయమై రాజ కృపావీక్షణమువలె శీతలమధుర మవుతుంది. కూచో వేమి తమ్ముడూ?

చంద్రసేనుడు : చతుస్సముద్రాధిపతి, సకలరాజ చక్ర చూడామణి శ్రేణీ శాణ కోణ కషణ నిర్మలీకృత చరణ నఖమణి, సర్వచక్రవర్తి ధౌరేయుడు, మహారాజాధి రాజ పరమేశ్వరుడైన శ్రీ హర్షదేవుని సోదరుడు కృష్ణభూపతి తమ సన్నిధికి కింకరుని పంపించినాడు. వాడు ద్వారదేశంలో ఉన్నాడు.

బాణుడు : ఆయుష్మాన్. అతనిని వెంటనే ప్రవేశ పెట్టుము.........

మేఖలకుడు : [ప్రవేశించి] ఆర్యశ్రీ బాణభట్టపాదులకు మేఖలకుడు శిరసాప్రణామము చేస్తున్నాడు.

**బాణుడు** : శుభం భూయాత్. భద్రా, అశేషభువన నిష్కారణ బంధు వయిన పూజ్యశ్రీ కృష్ణభూపతికి అనామయమే నా?

**మేఖలకుడు**: చిత్తం. మాననీయు లైన మాప్రభువు వారికి క్షేమమే.

**బాణుడు** : మేఖలకా, చాలా దూర ప్రయాణం చేసి వచ్చినట్లు కనపడతావు. శరీరమంతా బురదచారలు. కట్టుబట్టలు మాసిపోయినవి. కాళ్ళు తడబడుతున్నట్లు కనిపిస్తవి. కూర్చుని విశ్రాంతి తీసుకో.

**మేఖలకుడు** : చిత్తం. ముందు ప్రభువువారి లేఖ స్వీకరించండి.

**బాణుడు** : మంచిది. ఇటు తే. కురంగికా, చంపకా! మీరు సెలవు తీసుకోవచ్చు.

[తలుపు మూసిన చప్పుడు]

మేఖలకా, నీవు నోట ఏదో సందేశము తెలుపుతావనీ, నన్ను త్వరగా రాజదర్శనానికి రావలసినదనీ, అలస్యమువల్ల నష్టమనీ కృష్ణభూపతి వ్రాశాడు. ప్రధానవిషయ మేమిటో చెప్పగలవా?

**మేఖలకుడు** : సర్వజ్ఞు లయిన తమకు విశేషించి చెప్పవలసింది లేదు. సజాతీయత కాని, సగోత్రత కాని, సహసంవర్ధనము కాని, సహనివాసము కాని, బహు పర్యాయ దర్శనము కాని, పరస్పర అనురాగశ్రవణము కాని, పరోక్ష ఉపకారము కాని, మైత్రికి హేతువులు కదా. దూరాన ఉన్న కుముదాకరంమీద చంద్రునికివలె దూరాన ఉన్న మీమీద మాకు గాఢానురాగము కలిగింది. అయితే కొంతమంది అసూయాపరులు, కొండెగాండ్రు చక్రవర్తికి మీ విషయమై దుర్బోధలు చేశారు.

**చంద్రసేనుడు** : ఏమిటీ అన్నగారివంటి పూజ్యుల విషయంలో నే?

**మేఖలకుడు** : చక్రవర్తివారు చాలా సాధువులు. అయినా, సత్పురుషులకు కూడా శత్రు, మిత్ర, ఉదాసీనులు ఉంటారు. ఎవడో అసహనశీలుడు మీ విషయమై దుర్బోధలు చేస్తే నలుగురూ నమ్మతారు. శ్రీ అన్నవారుకూడా-

**చంద్రసేనుడు** : శ్రీ హర్షదేవులుకూడా విశ్వసించారా?

**మేఖలకుడు** : అటువంటివి వినడంవల్ల, మీయెడల కొంతవరకు ఉదాసీను లయినారు. మీ యథార్థస్థితి గ్రహించిన మేము శ్రీ అన్నవారికి చాలా నచ్చచెప్పినాము. కవికి కామినీగోష్ఠి యౌవన ప్రాదుర్భావంలో కొంత కొంత ఉన్నంత మాత్రాన అతన్ని భుజంగుడని నిజంగా నిందించనక్కరలేదు. యౌవనంలో ఎంతెంతవారుకూడా అంతో ఇంతో అవినయాలు చెయ్యకుండా ఉండరు, అది సహజం అని మేము చెప్పగా చెప్పగా చక్రవర్తి అవునని అంగీకరించారు.

**బాణుడు** : చక్రవర్తి చెవిదాకా వెళ్ళినవే మా చిన్నతనపు చేష్టలు!

**చంద్రసేనుడు** : చాలా చిక్కు వచ్చింది అన్నగారూ!

**మేఖలకుడు** : కాబట్టి కాలవిలంబం చెయ్యక రాజసన్నిధానానికి వస్తే లాభం ఉన్నది. మీ అభిమానులము ఉండబట్టే ఉన్నాము. మీ నిజబంధువులమధ్య నిష్ఫలతరువులవలె ఉండడం ఉచితం కాదు.

**చంద్రసేనుడు** : అన్నగారూ, ఇటువంటి స్థితిలో ఏమి లాభం, రాజాస్థానానికి వెళ్ళినా?

**మేఖలకుడు** : అన్యరాజులు వేరు, హర్షచక్రవర్తి వేరు. ఈయనలక్ష్మి బాంధవులకు ఉపయోగము, ఈయన పాండిత్యము విద్వాంసులకు ఉపకారి, ఈయన సంపద సద్బ్రాహ్మణులకు సహకారి, ఈయన పాదపల్లవచ్ఛాయ అధికపుణ్యము చెయ్యనివారికి అలభ్యము. ఈ ప్రకారంగా శ్రీమత్ కృష్ణభూపతులు తమకు మనవి చెయ్యవలసినదని సెలవిచ్చారు.

**బాణుడు** : కృష్ణభూపతికి నామీద అవ్యాజాను

గ్రహాము. ఆయన వాక్కులు ఆలోచించవలసి నవే. సరి, చంద్రసేనా, ఈ మేఖలకుని నీ వెంట తీసుకుపోయి, మజ్జన భోజనాదులు సమకూర్చు.

చంద్రసేనుడు : అయితే మేఖలకా, చక్రవర్తి పరిక్రృతంలో ఎక్కడ విడిసి ఉన్నారు.

మేఖలకుడు : మణితారపత్తన సమీపాన స్కంధావారంలో. ఆర్యా, సెలవు తీసుకుంటాను.

బాణుడు : మంచిది, బాగా విశ్రాంతి తీసుకో. ఇప్పుడేమి చెయ్యాను? గట్టి చిక్కు వచ్చింది...

అంబిక : ప్రశాంతి! ప్రాణేశ్వరులు ఏదో దీర్ఘా లోచనలో ఉన్నారు. నారాక కూడా గమనించ లేదు.

బాణుడు : అంబికా, రా, ఇలా కూర్చో.

అంబిక : ప్రాణనాథులు పరధ్యానంలో నిమగ్ను లయినారే.

బాణుడు : అవును ప్రియా, ఆలోచనలో పడ్డాను. గట్టి చిక్కు పట్టుకున్నది.

అంబిక : ఈ మీ పాదదాసి చిక్కు విప్పవచ్చునా?

బాణుడు : చూడు ప్రాణేశ్వరీ, అకారణ బంధు వయిన కృష్ణభూపతి, అంటే శ్రీహర్షులవారి సోదరుడు, నన్ను వెంటనే రాజదర్శనానికి న మ్మంటాడు. అయితే చక్రవర్తికి సదభిప్రాయం అట్టే ఉన్నట్లు అగుపడదు.

అంబిక : అటువంటప్పుడు మీరు రాజదర్శనం చెయ్యాక పోతే ఏమి?

బాణుడు : కృష్ణభూపతి కోరిక నిరాకరించడానికి వీలు లేనిది.

అంబిక : కావచ్చు. కాని చక్రవర్తి ఆహ్వానించ నిది ఆస్థానానికి ఎందుకు వెళ్లాలి! ఆయన పిలి పించినప్పుడే వెళ్లవచ్చు.

బాణుడు : పిలవని పేరంటానికి పోగూడదు. అయినా సార్వభౌముడు స్వయంగా మందుగా ఆహ్వానం పంపిస్తాడా!

అంబిక : ఎందుకు పంపగూడదు?

బాణుడు : పంపవచ్చు. అంత ప్రఖ్యాతి ఉంటే గాని.........

అంబిక : ఎందుకు లేదు? ఇదివరలో మీరు ఎన్నో విద్వద్గోష్ఠులలో పాల్గొన్నారు. ఎన్నో రాజ కులాలు చూచారు.

బాణుడు : అవును. అయినా రాజులు వేరు, రాజ పరమేశ్వరుడు వేరు.

అంబిక : సదభిప్రాయం లేని సార్వభౌముని సంద ర్శించకపోతే నష్టమేమిటి?

బాణుడు : ఆయనకు సదభిప్రాయం కలిగిస్తే ఆర్యావర్తానికి అంతకూ కలుగుతుంది.

అంబిక : ఇదివరకున్న కీర్తి చాలదూ? పెద్దలిచ్చి పోయిన ధనధాన్యములు ఉన్నవిగా!

బాణుడు: అగ్రహారంలో అర్ధభాగం పైగా హరించి పోయింది.

అంబిక : శేషం చాలదూ?

బాణుడు : చాల దనా! ఇల్లో కూచుంటే......

అంబిక : మీకు రాజోపచారాలు జరగడం లేదనా రాజదర్శనకుతూహలం!

బాణుడు : కాదు అంబికా! నీవంటి సాధ్వి ఇల్లాలు అయినప్పుడు నాకేమి లోపం? కృష్ణభూపతి ఆహ్వానం ఆదరించవలసినది.

అంబిక : రాజసేవ చాలా కష్టమయినది. రాజ కులము చాలా గంభీర మయినది. మీకు ఇది వరలో అక్కడ పరిచయం లేదు.

బాణుడు : భయం లేదు. ప్రభువు బ్రాహ్మణ విద్వ త్పక్షపాతియు కలవాడు. పరిచయానికి కృష్ణ భూపతి ఉన్నాడు.

అంబిక : రాజధానికి వెళ్లి మళ్లీ ఎన్నాళ్లలో వస్తారు ఏలినవారు?

బాణుడు : ప్రభువు రాజధానిలో లేడు. అజిరవతీ నదీతీరాన మణితారములో స్కంధావారములో ఉన్నాడు. వెళ్లి వారంరోజుల్లో తిరిగి వస్తాను.

అంబిక : ఇదివరలో ఎప్పుడైన అటువైపు వెళ్లారా?

బాణుడు : నీవు రాకపూర్వం దేశయాత్ర చేసిన పుడు ఒకసారి చూశాను.

అంబిక : అయితే ఏలినవారిని ఇప్పుడు ఇంట్లో కట్టి పడవేశా నంటారా?

బాణుడు : అనను. నాఅంతట నేనే కట్టుపడ్డా నను కోరాదూ? ఇంటిలో కాంతాహృదయము ఆక ర్షించడం ఆశ్చర్యం కాదుగదా. పైగా అబ్బాయి భూషణుడు...........

భూషణుడు : [పరుగున వస్తున్న చప్పుడుతో] – నాన్నా, నాన్నా, మనవాళ్ల యింటికి ఆడుకోటానికి వెళ్లనా?

అంబిక : ఎండ నాయనా! ఇప్పుడు వెళ్ళకు. చల్ల బడినాక వెళ్ళుదువుగాని......చూడు భూషణా! నాన్నగారు చక్రవర్తిని చూడబోతారట.

భూషణ : నేనుకూడా వస్తా నాన్నా!

అంబిక: వెళ్ళవద్దు నాయనా! ఇంకా ఆరేళ్ళు నిండ లేదు. నాన్నగారూ నీవూ వెళ్ళితే నేను ఒక్క త్తెనూ అసలే ఉండలేను.

భూషణుడు : వెళితే మళ్ళీ తొందరలో వచ్చేస్తా ముగా అమ్మా?

అంబిక : చిన్నవాడవు. అడవుల్లోనుంచి వెళ్ళాలి, నదులు దాటాలి. రాజుగారి మేడలు చూస్తే బెదురు పుడుతుంది. గుర్రాలూ, లొట్టిపిట్టలూ ఏనుగులూ ఉంటవి. ఆయుధాలు ధరించిన భటు లుంటారు.

భూషణుడు: గుర్రాలూ, లొట్టిపిట్టలూ, ఏనుగులూ ఎక్కుతాను. భటుల చేతుల్లో కత్తులు లాక్కుని యుద్ధం చేస్తాను.

బాణుడు : బాణుని బాలుడ వనిపించావు. [ముద్దు పెట్టుకొన్న ధ్వని]

అంబిక : పెద్దవాళ్ళే చక్రవర్తిని చూడడానికి జంకుతారు.

భూషణుడు : పెద్దవాళ్ళకు భయం, పిల్లల కేమి భయం? చక్రవర్తికి ఎదురుగా వెళ్ళుతాను. ఆయన నమస్కారం చేస్తే ఆశీర్వదిస్తాను. చక్రవర్తి నన్ను తన పక్కన కూచోపెట్టుకుని నామెడలో హారం వేస్తాడు.

అంబిక : బాగు, బాగు. అయితే ప్రాణేశ్వరులు ప్రభువు దగ్గిరికి రిక్తహస్తాలతో వెళుతారు కాబోలు?

బాణుడు : ఆచారవిరుద్ధంగా ఆచరిస్తానా?

అంబిక : అది కాదు. కావ్యము పట్టుకు వెడతా రేమో అని. అంటూ ఉండడమే గాని కాదంబరి ఇంతవరకు ప్రారంభించక పోతిరి. పద్యా లున్నవా?

బాణుడు : దానికి ఎప్పుడూ ఏదో విఘ్నమే. సద్యః స్ఫురణలో ఏవో శ్లోకాలు చెబుతానులే.

భూషణుడు: కాదంబరి నేనురాసిపెడతాను నాన్నా!

బాణుడు : కానీ ప్రారంభము? చివరకు నీవే పూర్తి చేస్తావేమో పెద్దవాడి వయినాక?

అంబిక : ప్రయాణముహూర్తం ఎప్పుడు?

బాణుడు : రేపు ఉదయం చాలా మంచిది.

అంబిక : ఎన్నాళ్ళలో వస్తారు?

బాణుడు : ఎన్నాళ్ళలో కూడానా? రాజదర్శనం కావడంఏమిటి, తక్షణం బయలుదేరి అంబికా దేవి అంఘ్రిసమీపంలో వాలడ మేమిటి! ...

అంబిక : చల్లటి మాటలతో స్వర్గం చూపిస్తారు! ప్రభువువారి పరివారంలో అందకత్తెలు అనేక మంది ఉంటారు. ఏలినవారకటాక్షణం ఎక్కడ పడు తుందో! అప్పుడు ఇల్లూ ఇల్లాలూ జ్ఞాపకం ఉంటారా?

బాణుడు : అలాఅనడం ధర్మమా అంబికా! నిన్ను చూడకపూర్వం మాటలు మరిచిపో. పత్నిగా ఇంట్లో నీవు ప్రవేశించినాక పరస్త్రీమాట ఎప్పుడైనా......

అంబిక : నేను సర్వజ్ఞురాలను కాను. నా పరో క్షంలో సంగతి తెలియదుకాని, ప్రత్యక్షంగా

నాయెదట-న్యాయానికి-ఎన్నడూ తలపెట్టలేదు.

భూషణుడు : నాన్నా నీవు వచ్చేటప్పుడు రాజు గారిని అడిగి, మా అబ్బాయికి ఏనుగు కావాలిట అని ఒకయేనుగు తెచ్చిపెట్టవు నాన్నా?

బాణుడు : ఎటువంటి కొడుకును కన్నావో చూశావా?

అంబిక : తండ్రికి తగ్గ కొడుకే. ఇప్పుడు మీ రాజదర్శన ప్రయాణం మన అదృష్టసౌధానికి మూలస్తంభం అనుకుంటాను.

బాణుడు : అంతా శివానుగ్రహం,

నమస్తుంగ శిరశ్చుంబి చన్ద్రచామర చారవే
త్రైలోక్యనగరారమ్భ మూలస్తమ్భాయ శమ్భవే.

## ద్వితీయరంగము

భట్టబాణుని గృహాంగణము: ఉదయము. మేఖలకుడు, చంద్రసేనుడు ఒక పక్కను, కొంతమంది జనులు మరోపక్కనూ ఉంటారు.

మేఖలకుడు : భట్టబాణులు ఇంకా ప్రయాణానికి సిద్ధమయినట్టు కనబడదు.

చంద్రసేనుడు : అవును మేఖలకా. బ్రాహ్మణులు-అందులో సంప్రదాయవేత్తలు - గ్రామాంతరము పనిమీద బయలుదేరడమంటే పట్టింపులు చాలా ఉంటవి. అందులో సార్వభౌమదర్శనానికి పండితసార్వభౌముడు ప్రయాణం కావడమంటే ప్రయత్నపూర్వకమైన వ్యాపారం... మా అన్నగారి మేనత్త మాలతీదేవి వస్తున్నది. కనుక్కుంటాను. ......... అత్తయ్యగారూ, అన్నగారు ఏం చేస్తున్నారు?

మాలతి : చంద్రసేనా, అతను అంగణములోకి రావడానికి ఇంకా కొంత అవశిష్టమున్నది. మొదట ప్రాస్థానిక సూక్తాలు పఠించాడు. దేవదేవుడైన త్రిపురాంతకస్వామికి క్షీరస్నానము చేయించి, సురభికుసుమ ధూపదీపాలతో అర్చన చేసి, ఆజ్యహోమం కూడా ముగించి, ప్రాఙ్ముఖమైన వైచికికి ప్రదక్షిణం చేశాడు. ఇక విప్రులకు దక్షిణ లివ్వాలి.

[బ్రాహ్మణుల వేదఘోష - చిరంజీవ! శుభం భూయాత్ మొదలైనవి వినబడతవి]

చంద్రసేనుడు: అవిగో బ్రాహ్మణాశీర్వాదాలు వినబడుతున్నవి. దక్షిణ లిస్తున్నా డనుకుంటాను.

మేఖలకుడు : బ్రాహ్మణులు పుచ్చుకోవడమే గాని ఇవ్వడం లే దనుకున్నాను.

మాలతి : మా బాణభట్టుపూర్వు లంతా షడంగములతో వేదాధ్యయనం చేసి, యజ్ఞయాగాదులు చేసినవారు. అందరూ సోమపీథులు, వారికి ప్రభువులు అయాచితంగానే అగ్రహారా లిచ్చారు. ఇతరులను దేహీ అనవలసిన అవసరం లేదు.

చంద్రసేన : మా అన్నగారు దేశాటనంలోనూ, దానధర్మాలలోనూ ద్రవ్యం బాగా వ్యయం చేసినవారు. వారిది భారీ చెయ్యి.

మాలతి : ఇప్పుడు కృష్ణభూపతి రాజదర్శనం చెయ్యవలసిం దని నీద్వారా లేఖ పంపడంచేతనే ప్రయాణం తలపెట్టినాడు, మేఖలకా!

మేఖలకుడు : చిత్తం.

మాలతి : శుభనిమిత్తంకోసం వాకిట గోమయంతో అంగణభాగం అలికించాను; పూర్ణకలశం పెట్టించబోతున్నాను.

మేఖలకుడు : ఆర్య, చంద్రసేనా, మీరు భట్టబాణులను అన్నగారు అంటారే చాలా చనువుగా; మైత్రినిబట్టే అనుకుంటాను. ఆయనకు మీమీద ఎంత అనురాగమండీ?

చంద్రసేనుడు : అన్నగారికి నామీద చాలా వాత్సల్యం! ఆయనది విశాలహృదయం! నేను ఆయనకు పారశవ భ్రాతను. అంటే, పూజ్యశ్రీ భట్టచిత్రభానులు ఆయనకూ నాకూ తండ్రి. ఆయన తల్లి రాజదేవి బ్రాహ్మణి. మా అమ్మ శూద్రాంగన. అన్నగారు కులభేదం పాటించక, స్వకీయ

సోదరునిగానే చూస్తారు, నన్ను. మాతమ్ముడు మాతృషేణుడు కూడా ఉన్నాడు. ప్రకృతం గ్రామాంతరం వెళ్లినాడు.

మేఖలకుడు : అలాగా! మీరుకూడా మణితారపత్తనానికి వస్తున్నారన్నమాటే.

చంద్రసేనుడు : అవును; అన్నగారి కోరిక. నన్ను వెంటబెట్టుకోకుండా వెళ్లరు గ్రామాంతరానికి ఎన్నడూ.

మేఖలకుడు : అదుగో చూడండి.........బ్రాహ్మణులు వెంట నడుస్తూ ఉండగా ఇటే వస్తున్నారు భట్టబాణులు.

చంద్రసేనుడు : అన్నగారు ఎంత కళకళలాడుతున్నారు. శరీరాన శుక్లాంగరాగము పూసుకుని, శ్వేతకుసుమమాలికలు కంఠాన ధరించి, దూర్వాగ్ర పల్లవములతో కట్టిన గిరికర్ణికా కుసుమగుచ్ఛము చెవిలో పెట్టుకొని, ఎంత రమణీయంగా ఉన్నారు......

మాలతి : అదుగో బాణా, కుసుమమాలికలు మెడకు చుట్టి ముఖాన నవచూత పల్లవాలు కప్పిన కలశము చూడు.

బాణుడు : చూచాను అత్తయ్యా.

మాలతి : కులదేవతలకు మొక్కు నాయనా!

బాణుడు : నమోనమః కులదేవతాభ్యః......చంద్రసేనా, ప్రయాణసన్నాహంలో ఉన్నావా?

చంద్రసేనుడు : చిత్తం

మాలతి : చంద్రసేనా, నిదాఘకాలం. ప్రయాణంలో భద్రంగా ఉండాలి. మేఖలకా, మా మేనల్లుడు కష్టపడ్డవాడు కాడు. దుర్గమమార్గాన కాక, సులభమార్గాన తీసుకు వెళ్ళు.

మేఖలకుడు : చిత్తం, దేవిగారి ఆజ్ఞాప్రకారమే!

బాణుడు : మా అత్తయ్యకు నామీద వాత్సల్యం. మా అమ్మగారు పోయిన తర్వాత నన్ను పెంచింది.

మాలతి : ముత్తయిదువులు, ముందుకు రండి, నాయనా దక్షిణ పాదం ముందు వెయ్యి. పుష్పఫలహస్తులైన బ్రాహ్మణులు వెంట నడవండి.

బాణుడు : [బ్రాహ్మణులు కలిసి]

య శ్శివో నామరూపాభ్యాం
యా దేవీ సర్వమంగళా
తయో స్సంస్మరణా త్పుంసాం
జాయతే సర్వమంగళమ్!

## మూడో రంగము

(రాజద్వారము - సాయంసమయము)

చంద్రసేనుడు : అన్నగారూ, మేఖలకుని వెంట వస్తున్న ఆ విచిత్రపురుషుడు ఎవరో! ఉన్నత శరీరుడు, కర్ణికార గౌరవర్ణుడు, శ్వేతకంచుకాచ్ఛాదిత గాత్రుడు, ధగధగ వెలిగే మాణిక్య పదకము సన్ననినడుముకు కట్టుకున్నాడు. వెడదరొమ్మమీద హారము అద్భుతకాంతులు చిమ్ముతున్నది. శ్రవణమండలములు మాణిక్యములతో మిరుమిట్లు గొలుపుతున్నవి. ఉష్ణీషము హిమపాండురము; గండుముత్యాలు చెక్కిన దంతపు పిడిగల ఖడ్గమును వామహస్తమున ధరించినాడు. కుడిచేతితో బంగారపు వేత్రయష్టి పట్టుకొన్నాడు.

మేఖలకుడు : ఆర్య, ఈయన మహా ప్రతిహారులలో ప్రధానుడు; ప్రభువువారికి ప్రీతిపాత్రుడు, పారియాత్రిక నామధేయుడు. తాము ఈయనను అనుగ్రహదృష్టితో చూడండి.

పారియాత్రికుడు : ఆర్యశ్రీ బాణభట్టపాదుల పాదపద్మములకు పారియాత్రికుడు శిరసా ప్రణమిల్లుతున్నాడు. ఆర్యులకు కుశలమా?

బాణుడు : అఁ. శుభం భూయాత్.

పారియాత్రికుడు : తమ ప్రయాణం సుఖంగా జరిగిందా?

బాణుడు : ఒకవిధంగా. మొన్న చండికా కాననము దాటాము. నీళ్ళు లేవు. ఆకులు రాలిన చెట్లు ఎక్కడచూచినా. కొన్నిచోట్ల వంగి, దూరిపోవలసివచ్చింది. అడవి జంతువులు తోతులు కొల్లలు. తేనెటీగలు కుట్టునవేమో అనిపించింది. తర్వాత 'మల్లకూట' గ్రామం ప్రవేశించాము. అక్కడ మా బంధువు జగత్పతి సపర్యలు చేయించాడు. నిన్న భగవతి భాగీరథీనదిని ఉత్తరించి 'యష్టిగ్రహక' మనే వనగ్రామములో రాత్రి గడిపాము. ఈ ప్రాతఃకాలం బయలుదేరి స్కంధావారం ప్రవేశించాము.

పారియాత్రకుడు: చిత్తం. సార్వభౌములు తమయెడ ప్రసన్నచిత్తులై ఉన్నారు. ఈ సమయంలోనే తాము రాజదర్శనం చెయ్యడం శుభం.

బాణుడు : శ్రీ హర్షదేవ చక్రవర్తికి నామీద అనుగ్రహం ఉండటంచేత ధన్యుడను. ప్రభువు ఇప్పుడెక్కడ ఉన్నారు?

పారియాత్రికుడు : మూడు కక్ష్యాంతరాలు దాటితే నాలుగవ కక్ష్యలో భోజనశాలకు ఎదురుగా ఉన్న కుట్టిమాన, హరిచందన రసార్ద్రమై, తుహిన బిందుశీతలమై, గజదంత పాదములు కలిగిన ముక్తా శిలా పట్టశయనముమీద ఉపవిష్టులై ఉన్నారు.

బాణుడు : వారి సమక్షంలో ఎవరెవరున్నారో. తెలుసునా?

పారియాత్రికుడు : శిష్టులు, ఇష్టులూ ఉన్నారు. ప్రభువు తమకు అత్యంత ప్రీతిపాత్రులైన మాళవరాజ పుత్రునితో సరససల్లాపాలు చేస్తున్నారు. సన్నిధిలోనే కృష్ణభూపతికూడా ఉపవేశించి ఉన్నారు.

బాణుడు : అయితే ఇది శుభసమయము.

[వెనుకటినుంచి కొందరి మాటలు: ఆఁ ఆఁ శాంతం శాంతం]

పారియాత్రికుడు : ప్రభువువారి భద్రగజమును మావటీడు కొంచెం అదిలిస్తున్నట్లు తోస్తుంది.

బాణుడు : భద్రా, ఈ దర్పశాత మనే గంధగజాన్ని గురించి విన్నాము. ఒక్కసారి చూడవలెనని కుతూహలం.

పారియాత్రికుడు : చిత్తం అలాగే.

బాణుడు : చంద్రసేనా, మనం ఈ మాతంగమును చూచినతర్వాత నీవు మేఖలకునితో మన నివాసానికి వెళ్ళు. పారియాత్రికా, ఆలస్యం చెయ్యకుండా వెళదాము.

అందరూ : చిత్తం.

## నాలుగో రంగము

[భోజనశాలా సమీపస్థలము]

పారియాత్రకుడు : మనం రాజ సన్నిధానం చేరబోతున్నాము.

బాణుడు : మంచిది. పారియాత్రికా, దర్పశాతము ఎంత గొప్పదేనుగు! దాని రూపము ఇంకా నా నేత్రాలను విడవకుండా ఉన్నదే.

సమర జంగమ దుర్గమై సార్వభౌము
నకు బహిఃప్రాణమైన యా నాగము గన,
తోచు ఆదివరాహమ్ము తుండమునను,
దంతయుగ్మమ్ముతో వింధ్యధరణిధరము.

భవతు! ప్రభువు అల్లే ఉన్నారు కదా.

కాంచనాద్రితటము కైవడి వెడదయై,
అజిర మగుచు సమర విజయలక్ష్మి
కర్ణిక విచిత్ర రత్నహారాంచితోరస్కు
డౌ నరోత్తముండె హర్షవిభుడు.

మంచిది! ఉపవీతినై సమీపిస్తాను.

[నల్వు వినిపించిన తరువాత నిశ్శబ్దము]

స్వస్తి, సకలరాజచక్రచూడామణీ
శాణకషణవిమల చరణ యుగళ
నఖమణికిని, హర్షనాయకాగ్రణికిని,
దృప్త వైరినాగ తీవ్రసృణికి!

[వెనుకనుంచి పాట వినిపిస్తుంది]

విదనాడి కాల్యమ్ము వేదండ కలభ.
వినమితాననుడవై వినయవ్రతంబు
చరియించు మృగరాజ శాతనఖాగ్ర
భంగురాంకుశము నీపై బడగలదు.

చక్రవర్తి : ఆ బాణభట్టు ఈయనయేనా పారియాత్రికా?

పారియాత్రికుడు : చిత్తము మహాప్రభూ!

చక్రవర్తి : మాళవరాజపుత్రా, బాణభట్టు మహా భుజంగుడు సుమా!

బాణుడు : దేవా, యథార్థ మెరుగనివానివలె, అశ్రద్ధధానునివలె, పరవశునివలె, అవిదిత లోక వృత్తాంతునివలె సెలవిచ్చినారు. సోమపీథులైన బ్రాహ్మణోత్తముల వంశములో పుట్టినాను. యథావిధిగా ఉపనయనాది సంస్కారాలు పొంది, సాంగోపాంగముగా వేదాధ్యయనము చేశాను. శాస్త్రములు యథాశక్తిగా అభ్యసించాను. వివాహము చేసుకొని కుటుంబము నిర్వహిస్తున్నాను. నా భుజంగత యేది? యౌవనారంభములో ఏదో కొంత చాపల్యము ఉన్నందుకు మనస్తాపము లేకపోలేదు. దేవర ఏకచ్ఛత్రాధిపత్యము చేస్తూ, ఆర్యాగ్రాలు సక్రమముగా నడిపిస్తూ ఉంటే, ఎవరు అవినయము ఆచరించగలరు? కాలక్రమేణ దేవరవారే నా యాథార్థ్యము తెలుసుకోగలరు.

చక్రవర్తి : [నెమ్మదిగా] మేము ఇలాగని విన్నాము.

[వందిమాగధులు వెనకనుంచి పాడుతారు]

దివసము ధౌతారకూట
దీధితితో కోమలముగ
శమియించిన దిక దేవా,
సంధ్యోపాసనకు వేళ.

అస్తాచల కూట మకుట
మైన దివాకరుడు నిమళ
మంజరీ నికాళు డగుచు
మధురద్యుతి నుల్లసిల్లు.

అజిరవతీ నదీతటము
లతి దుస్సహ శోకాకుల
కోక కామినీ విలాప
కూజిత ముఖరితము లయ్యె.

జయ జయ తీవ్రప్రభావ
శమిత శాత్రవ ప్రతాప!
జయ జయ శ్రీ సార్వభౌమ!
సంధ్యోపాసనకు వేళ!

చక్రవర్తి : అస్తు! సంధ్యోపాసనకు లేస్తాము.

[నభంగా జయ జయ ధ్వనులు]

## అయిదో రంగము

[బాణుని భవనము - సాయంత్రము]

భూషణుడు : నాన్నా, నేను అడిగినట్లుగా ఏనుగు తెచ్చావు గాని మళ్లీ పంపించేశావేం!

అంబిక : నాన్నను మన యింటిదగ్గర దింపడానికి చక్రవర్తి ఏనుగును పంపారు. మనకోసం కాదు.

భూషణుడు : ఏనుగుమీద అంబారీలో కూచుంటే ఎంత బాగున్న దనుకున్నావు అమ్మా! మనకు దాన్ని ఇచ్చేస్తే అందాకా ఉండేది. ఆడుకునేవాణ్ణి, ఎక్కి తిరిగేవాణ్ణి.

అంబిక : ఏనుగును భరించడం ఎంత కష్టం! తోటలో లేడిపిల్లలతో ఆడుకో.

బాణుడు : అంతా వెళ్లారేమో చూడు. అత్తయ్య కూడా.

అంబిక : భూషణా, మెళ్ళో హారం పారేసుకునేవు! చక్రవర్తిగారు కోపపడతారు. ............ అయితే ప్రాణేశ్వరులు వస్తామన్న రోజుకు రాక మూడువాళ్ళు ఆలస్యం చేశారేమి? అక్కడి అందకత్తెలు ఆపేశారనుకుంటాను.

బాణుడు : అక్కడ అందకత్తెలున్నా ఆప లేదు. ఆప లేరు. ఇంటివద్ద శ్రీమతి అంబికా దేవి గారు,........

అంబిక : ఈ పొగడ్తల కేమి గాని - ఎందుచేత రాలేదండి మీరు? రోజూ ఉదయం, సాయంత్రం మీ కోసం ఎదురుచూస్తూ ఆదుర్దాలో ఉన్నాము. భూషణుడు మీకోసం ఒకటే పోరు.

బాణుడు : అనుకున్నట్టు బయలుదేరేవాడినే కాని, మొదట్లో కథ అడ్డం తిరిగింది.

అంబిక : ఏమి టేమిటి.

బాణుడు : మహారాజును చూడగానే స్వస్తివచనం పలికాను. ఆయన లేవలేదు. నమస్కారం చెయ్యలేదు. నన్ను కూర్చోమని అయినా అన లేదు. పైగా మాళవరాజపుత్రునితో బాణ భట్టు మహాభుజంగు డన్నాడు.

అంబిక : అన్నా, అంతమాట అందరిలో అనడమే. ప్రభువులకు పలుకులో పారుష్యం ఎక్కువ. అప్పుడు మీరు ఊరుకున్నారా? ఊరుకునేవారు కారే.

బాణుడు : తగిన సమాధానం ఇచ్చి, నా మంచి చెడ్డలు క్రమేణ మీకే తెలుస్తవి అన్నాను.

అంబిక : ఆయనకు ఆగ్రహం రాలేదా? సార్వభౌముడు చండశాసనుడూ కదా.

బాణుడు : కోపించలేదు. మేము ఇలాగని విన్నాము అన్నాడు. మర్యాదలు ఏమీ చెయ్యలేదు, కాని మరలి పోయేటప్పుడు చల్లనిచూపు చూచినాడు.

అంబిక : ఎవరో ఈర్ష్యాపరులు, కొండెగాండ్రు ప్రభువుకు దుర్బోధలు చేసిఉంటారు.

బాణుడు : అనుమానమా? కర్ణేజపులకు కరువులేదు. అయితే యౌవనారంభంలో ఏదో కొంత చాపల్యం లేకపోలేదు అన్నాను.

అంబిక : సార్వభౌముని సమక్షంలో సాహసించి అంతమాట అనేశారా?

బాణుడు : సాహసం ఏముందీ? చక్రవర్తి మాత్రం మగవాడు కాడూ! కవి అయినవాడికి కాస్తో కూస్తో కామినీగోష్ఠి తప్పదని ఆయనకు తెలియదూ? అయితే ఆయనకు ఆర్యధర్మాలమీద అత్యంతాభిమానము.

అంబిక : ప్రభువులపద్ధతులు చిత్రంగా ఉంటవి.

బాణుడు : ఆ సమయంలో ప్రభువు ప్రసన్నుడుగా లేకపోయినా అమృత స్నిగ్ధమై స్నేహగర్భమైన దృష్టిపాతంవల్ల అంతర్గతమైన ప్రీతి స్ఫురించింది. మర్నాడు కృష్ణభూపతి నన్నుగురించి చాలా చెప్పినాడు.

అంబిక : అంతరంగంలో అనురాగం ఉంటే అప్పుడే ఎందుకు స్పష్టీకరించలేదో చక్రవర్తి?

బాణుడు : ప్రభువుల పద్ధతులు చిత్రమైన వని నీవే అన్నావు. గంభీరహృదయులు ఏభావమూ ప్రకటించరు. అసలు ప్రభువుకు నామీద అనుగ్రహం లేకపోతే దర్శనమే ఇచ్చేవారు కారు. నేను వృద్ధిలోకి రావలె నని ఆయన ఊహ.

అంబిక : అయితే ఆదినిష్ఠూరమే మంచి దయింది.

బాణుడు : అవును. అంత్యనిష్ఠూరం అసహ్యం కాదూ? తర్వాత మంచిరోజు చూచి నిండుకొలువులో చక్రవర్తి నాకు సమస్తసన్మానాలూ చేసినాడు. నేను ప్రాస్తావిక శ్లోకాలు ఏవో చెప్పినాను. నా ఉపన్యాసం అందరూ అభినందించారు.

అంబిక : మీరు మాటాడుతుంటే పుస్తకంలాగే ఉంటుంది.

బాణుడు : సమీచీనమ్! ఇంట గెలిచి రచ్చన గెలవడం మంచి దన్నారు. ఇల్లాలికి నావాక్కులు ఇంపుగా ఉన్నతర్వాత ఏమి కొదవ.

అంబిక : ఏమి చాటుకారు లండీ ఏలినవారు!

బాణుడు : ప్రభువు నన్ను మిత్రవర్గంలో చేర్చుకున్నాడు. అన్నిటికంటే విశేషం : అనుమతి ముందుగా పొంద నక్కరలేకుండానే తన సన్నిధానానికి నా యిష్టం వచ్చినప్పుడు వస్తూపోతూ ఉండవచ్చు నని అందరికీ తెలియపరిచినాడు.

అంబిక : బాగు బాగు! ఇక మీరు నిశ్చింతగా కూచుని 'కాదంబరీ' రచన కానియ్యవచ్చు.

బాణుడు : కాదంబరికి కొంతటినుంచి విఘ్నాలే. హర్షదేవునిమీద అనురాగంవల్ల ముందు హర్ష చరిత్ర రచిస్తాను.

అంబిక : చాలాసంతోషం! భరతఖండం యావత్తూ పరిమోదం చెందుతుంది. భవతు!

బాణుడు : అంతా పురారాతి అనుగ్రహం! మా అంబికాదేవి చలవ! ఇటుచూడు అంబికా, నీది దివ్యమంగళవిగ్రహము సుమా!

స మా ప్త ము.

[8-10-1941 బుధవారం రాత్రి 8-30-9 గంటలవరకు ఆల్ ఇండియా రేడియో వారు మదరాసునుంచి ప్రసారం చేయించింది]

## నవ్యగ్రంథ విక్రయశాల : నవ్యసాహిత్య పరిషత్, గుంటూరు.

### గిడుగు వెంకటరామమూర్తి

| | |
|---|---|
| వ్యాస సంగ్రహము | ౪-౮-౦ |
| వ్యాసావళి | ౧-౦-౦ |
| బాలకవిశరణ్యము | ౧-౮-౦ |
| భాషాభేషజము | ౧-౦-౦ |
| గద్యచింతామణి | ౧-౮-౦ |

### రాయప్రోలు సుబ్బారావు

| | |
|---|---|
| ఆంధ్రావళి | ౧-౦-౦ |
| జడకుచ్చులు | ౧-౦-౦ |
| మధుకలశము | ౧-౦-౦ |
| తృణకంకణము | ౦-౮-౦ |
| తెనుగుతోట | ౦-౮-౦ |
| కష్టకమల | ౦-౮-౦ |
| స్వప్నకుమారము | ౦-౮-౦ |
| స్నేహలతాదేవి | ౦-౮-౦ |
| రమ్యాలోకము | ౧-౮-౦ |

### చింతా దీక్షితులు

| | |
|---|---|
| ఏకాదశి | ౧-౦-౦ |
| శబరి | ౧-౦-౦ |
| లక్కపిడతలు | ౦-౨-౦ |

### శ్రీ పిఠాపురం యువరాజావారు

| | |
|---|---|
| తరంగములు | ౦-౮-౦ |
| స్వార్థత్యాగము | ౧-౦-౦ |
| ఆ లోకమునుండి ఆహ్వానము | ౧-౦-౦ |
| చినుకుల చిందులు | ౧-౦-౦ |
| '—' (నామరహితము) | ౧-౦-౦ |

### దేవులపల్లి కృష్ణశాస్త్రి

| | |
|---|---|
| కృష్ణపక్షము, ప్రవాసము, ఊర్వశి | ౧-౪-౦ |

### చిలుకూరి నారాయణరావు

| | |
|---|---|
| అంబ, లేక మొండిశిఖండి | ౦-౮-౦ |
| అశ్వత్థామ | ౦-౬-౦ |
| అచ్చి, లేక కాపురవలపు | ౦-౭-౦ |
| పెండ్లి | ౦-౪-౦ |
| ఉమార్ ఖయామ్ | ౦-౮-౦ |
| ఉపనిషత్తులు | ౦-౮-౦ |
| ఖురానుషరీఫు | ౪-౦-౦ |
| అశోకుని ధర్మశాసనములు | ౨-౦-౦ |
| సంస్కృత లోకోక్తులు | ౨-౦-౦ |

### విశ్వనాథ సత్యనారాయణ

| | |
|---|---|
| శృంగారవీథి | ౧-౦-౦ |
| వేయి పడగలు | ౨-౮-౦ |
| ఏకవీర | ౧-౦-౦ |
| శశిదూతము | ౦-౬-౦ |
| మాస్వామి | ౦-౬-౦ |
| ఋతుసంహారము | ౦-౬-౦ |
| చెలియలికట్ట | ౧-౦-౦ |

### శ్రీ శివశంకర శాస్త్రి

| | |
|---|---|
| వకుళమాలిక | ౦-౮-౦ |

### నోరి నరసింహశాస్త్రి

| | |
|---|---|
| భాగవతావతరణము | ౦-౪-౦ |
| సోమనాథవిజయము | ౧-౦-౦ |
| నవనీతము | ౦-౧౨-౦ |

### మల్లవరపు విశ్వేశ్వరరావు

| | |
|---|---|
| మధుకీల | ౧-౦-౦ |
| కళ్యాణకింకిణి | ౧-౦-౦ |

### రెండుచింతల లక్ష్మీనరసింహశాస్త్రి

| | |
|---|---|
| హృదయవిహంగము | ౦-౮-౦ |
| పరీక్ష | ౦-౮-౦ |

# నవ్య సాహిత్య పరిషత్తు

## గౌరవాధ్యక్షులు:

సర్ కట్టమంచి రామలింగారెడ్డి
ప్రొఫెసర్ రాయప్రోలు సుబ్బారావు

### అధ్యక్షుడు:

అడివి బాపిరాజు

### ఉపాధ్యక్షులు:

దేవులపల్లి కృష్ణశాస్త్రి
శ్రీరంగం శ్రీనివాసరావు

### కార్యదర్శి:

తెలికిచర్ల వెంకటరత్నం

### సహాయ కార్యదర్శి:

మల్లవరపు విశ్వేశ్వరరావు

### సభ్యులు:

పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి
ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి
పిలకా గణపతి శాస్త్రి
తల్లావజ్ఝల కృత్తివాస తీర్థులు
మొక్కపాటి కృష్ణమూర్తి
నండూరి వెంకట సుబ్బారావు
విశ్వనాథ సత్యనారాయణ
పెనుమర్తి కామేశ్వరరావు
యస్. రాఘవాచారి (సంపత్)
రుక్మిణీనాథ శాస్త్రి
శ్రీమతి దుర్గాబాయి
చింతా దీక్షితులు
వావిలాల సోమయాజులు
కూర్మా గోపాలస్వామి
ఏల్చూరి సుబ్రహ్మణ్యం
మాచిరాజు దేవీప్రసాద రావు

### కార్య నిర్వాహక వర్గము:

అడివి బాపిరాజు
తెలికిచర్ల వెంకటరత్నం
కాటూరి వెంకటేశ్వర రావు
నండూరి వెంకట సుబ్బారావు
వావిలాల సోమయాజులు

### 'ప్రతిభ' సంపాదక వర్గము

అడివి బాపిరాజు
తెలికిచర్ల వెంకటరత్నం
దేవులపల్లి కృష్ణశాస్త్రి
నోరి నరసింహ శాస్త్రి
మొక్కపాటి నరసింహ శాస్త్రి
మువ్వూరి రామిరెడ్డి
కొడవటిగంటి కుటుంబరావు
బాలగంగాధర తిలక్

### గ్రంథ నిర్ణాయక సంఘము:

అడివి బాపిరాజు
తెలికిచర్ల వెంకటరత్నం
జమ్ములమడక మాధవరామశర్మ
దేశిరాజు కృష్ణశర్మ
వేదుల సత్యనారాయణ శాస్త్రి
శ్రీరంగం నారాయణబాబు
బి. వి. సింగరాచార్యులు
కల్లూరి సుబ్బారావు